

This Book is
Published with the
Financial Assistance of
Tirumala Tirupati Devastānams
under their scheme
"Aid to publish Religious Books"

# అంకితం

సమస్తలోక కల్యాణప్రదాత

శ్రీ భద్రాచల

సీతారామచంద్రస్వామివారి

దివ్యచరణారవిందములకు

రసప్రియ రామాయణం

గేయకావ్యం

# సీతాన్వేషణ

(కిష్కింధాకాండ)

రసప్రియ
ఘోతేదార్ కేశవాచార్య

---

తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో
ముద్రింపబడినది.

భోజప్రచురణ - 7

ప్రథమ ముద్రణ : 1000 ప్రతులు.

విభవ వైకుంఠ ఏకాదశి - 1988



వెల : రూ. 25-00

ప్రతులకు :

ఎఫ్. రాజశేఖర్, బి. ఎస్‌సి.
C/o. వై. వి. ప్రెస్
ట్రంక్ రోడ్, ఖమ్మం - 507 003

ముద్రణ : శివనిర్మల్ ప్రింటర్స్, గాంధీచౌక్, ఖమ్మం - 3

# పీఠిక

—రసప్రియ

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో ముద్రించిన నా 'పర్ణశాల' గేయ కావ్యానికి పీఠిక వ్రాస్తూ — ప ర్ణ శా ల ఎక్కడ అను అంశమును చర్చించాను. అది భద్రాచల సమీపంలో గల గోదావరినదీ తీర ప్రాంతమే అని వాల్మీకి చెప్పిన భౌగోళిక మార్గాల కనుగుణంగా ఋజువులు చూపుతూ ధ్రువపఱిచాను. అచట నేటికీ రథపుగుట్ట పేరుతో ప్రసిద్ధమైయున్న బండిచాలులుగల గుట్ట ఒకటి ఉంది.

పర్ణశాల తనకు సమీపాన వెలసి యుండినదని, పర్ణ శాలలో జరిగిన ప్రతి ఘట్టము వర్ణిస్తూ, ఆ గుట్ట నాతో చెప్తూన్నట్లు గేయకావ్యం సాగిపోయింది. శూర్పణఖ ముఖ భంగం, ఖరాదుల సంహారం, స్వర్ణహరిణం, సీతాపహరణం, జటాయువు పోరాటం ఇత్యాది సంఘటనలు పర్ణశాల ప్రాంతంలోనే జరిగినవి. సీతను రావణుడెత్తుక పోయాడని జటాయువు చెపుతాడు. రామలక్ష్మణులు జటాయువునకు దహన సంస్కారాలు చేస్తారు. జటాయువు ముక్తి పొందుతాడు. అంతవరకే 'పర్ణశాల' కావ్యం ముగించాను. ఆ

తరువాత సీతాన్వేషణలో జరిగిన ఘట్టాలు వర్ణిస్తూ జటాయువు అన్న 'సంపాతి' తన కాలిన రెక్కలు చిగురించి ముక్తుడైనంత వరకు వ్రాశాను. దీనికి 'సీతాన్వేషణ' అని నామకరణం చేశాను.

నా 'పర్ణశాల'లో పర్ణశాల ఎక్కడ అను ప్రశ్న ఎదురైనట్లు 'సీతాన్వేషణ'లో 'కిష్కింధ' ఎక్కడ అను జిజ్ఞాస నాలో ఉదయించింది. రామలక్ష్మణులు సీతాన్వేషణ చేస్తూ దక్షిణం పట్టి మూడు కోసులు తూర్పు దిశగా దాటి మతంగాశ్రమం పైపు వెళ్తుండగా ఘోరాటవులు తటస్థించినవి. అయోముఖి కబంధాదుల సంఘటనలు జరిగినవి.

ఋష్యమూకంపై నివసిస్తూన్న సుగ్రీవునితో స్నేహం చేయమని అతని సహాయంతో నీ కార్యం నెరవేరుతూందనీ కబంధుడు రామునితో చెపుతాడు. ఋష్యమూకానికి మార్గాన్ని వివరిస్తూ అది పంపా సరోవరానికి పడమటొడ్డున కలదని చెపుతాడు. పంపా శబరీ మతంగాశ్రమాల గురించి తెలుపుతాడు. అవి ఋష్యమూకానికి చేరే ముందు తాకుతాయి. పర్ణశాల ప్రాంతంనుండి దక్షిణంగా నైరుతి దిశ మూడు కోసులూ మళ్లీ మూడు కోసులు తూర్పుదిశగా పయనించిన రామలక్ష్మణులు ఇప్పుడు కబంధుడు చెప్పిన పంపా మతంగాశ్రమాలు చేరడానికి పడమటి దిక్కు పట్టారు. ముందు పంపాసరోవర ప్రాంతానికి చేరుకుంటారు.

అక్కడే కిష్కింధ. అక్కడే ఋష్యమూకం. అక్కడే మతంగాశ్రమం, అక్కడే శబరి ఆశ్రమం. అయితే ఈ అక్కడ ఎక్కడ? అనేది తెలుసుకొనదగిన విషయం.

## తుంగభద్రే పంపాసరస్సా!

ఆంధ్ర వాల్మీకి వాసుదాసస్వామి వాదం ప్రకారం కానీ శ్రీ కుందూరి ఈశ్వరదత్తు గారి ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం ప్రకారం కానీ శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి వాదం ప్రకారం కానీ పంపను తుంగభద్ర అనీ 'హంపీ' అని 'పంప' అని, ఋష్యమూకం తుంగభద్రకు ఉత్తరాన ఉంది అనీ, విద్యానగరం లేక విజయనగరమే కిష్కింధ అనీ, అక్కడే అంజన పర్వతం, మాల్యవంతం, మతంగ పర్వతం. ఋష్యమూకం వాటికి అంటుకొని తుంగభద్ర ప్రవహిస్తుంది అనీ, పంపా విరూపాక్ష దేవాలయానికి ఎదురుగా మతంగాశ్రమం ఉంది అనీ ధృఢంగా తెలుస్తుంది. నాటి కిష్కింధయే నేడు విజయనగరమైంది. దాన్ని నిర్మించిన వారు హరిహర బుక్కరాయలని అందరెరిగినదే.

నేనొక మేధావితో చర్చించినప్పుడు వారొక అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. 'తూర్పు గోదావరి జిల్లాలో 'కొల్లేరు' అను సరస్సు వుంది. దాని మధ్యన కోట దిబ్బ వుంది. ఆ సరస్సే పంప. ఆ దిబ్బే ఋష్యమూకం. అక్కడే కిష్కింధా నగరం వుండివుండాలి. ఇంకొక

సాదృశం ఏమంటే ఎర్రగాలువ సముద్ర జలంతో ఎదురు తన్ని వచ్చి కొల్లేరు సరస్సులో పడుతుంది నేటికీ. అది మతంగ మహర్షి వృత్తాంతాన్ని తెలుపుతుంది. మతంగ మహర్షి ఆజ్ఞాపించగా సముద్రుడు అతని సమీపంలోకి వచ్చాడట. ఆ సాదృశం కొల్లేరులో కనిపించినట్లు హంపిలో కనిపించదు. రాముడు తూర్పు కనుమలగుండా లంకకు వెళ్లాడు. అట్లా వెళ్లటానికి వీలౌతుందికూడా!' అని. ఇదికాక శ్రీ అయ్యప్పస్వామి భక్తులు పంపాశబరిమలై ప్రాంతాన్ని గురించి చెపుతారు. అది కేరళ ప్రాంతం. చరిత్ర పరిశోధన చాల పట్టుదలతో చేయవలసిన పని. రామాయణంలో భౌగోళిక విషయాలెన్నో ఉదహరించ బడ్డవి. ప్రతి ప్రాంతం గురించి తెలుసుకోవాలని ఎవరి కుండదు తహతహ? చరిత్రకారులు పరిశోధన చేసి భౌగోళిక సత్యాన్ని చాటితే అంతకంటే పుణ్యకార్యం ఏముంటుంది?

రామ లక్ష్మణులు పంపా సరోవర ప్రాంతానికి వస్తారు సుగ్రీవుని కోసం. సుగ్రీవునితో స్నేహబంధం జరిగింది. ఈ స్నేహబంధం వాలి వధకూ, వారధి బంధానికీ, రావణ సంహారానికీ కారణమైంది. ఇక్కడ ధర్మం పునరుద్ధరించ బడటానికి పునాదులు వేయటం జరిగింది. అందుకే ఈ స్నేహబంధానికి ఎంతో విలువ వుంది. ఇట్టి స్నేహబంధం జరిగింది పంపా సరోవర ప్రాంతం కాబట్టి

స్థల ప్రాధాన్యత గల పంప ఎక్కడ? అను జిజ్ఞాస నాలో రగిలింది. అయితే ధృఢముగా తెలియని 'వేంగీ కొల్లేరు' కన్న ధృఢముగా చెప్పబడే 'హంపీ - తుంగభద్ర'నే ఇట్టి పవిత్ర చరిత్రాత్మకమైన స్థలముగా నమ్మదగినదని భావిస్తాను.

దివాకర్ల వారి ప్రేరణ :

కీ॥శే॥ శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు నా 'పర్ణ శాల'కు 'ప్రశంస' వ్రాస్తూ ఒకచోట— "శ్రీ కేశవాచార్యులు గారు.......ఈ విధముగా రామాయణము నంతనూ వ్రాసిన యెడల పండిత పామరులకెంతో ఆహ్లాదకరముగా ఉండును" అని అన్నారు. పూజ్యపాదుల ఆదేశంలోని అభినందనాశీర్వాదము నన్నెంతో ప్రోత్సహించి తక్కిన కాండలు వ్రాయాలనే కుతూహలం—ఆలోచన నాలో చిగురించింది. 'పర్ణశాల' యాదృచ్ఛికంగా వ్రాశాను. తక్కిన కాండలు వ్రాయాలన్న తలపు నాకు లేదు. ఒక రథపుగుట్ట ప్రేరణతో 'పర్ణ శాల' వ్రాశాను. "ఇది అరణ్యకాండ అయింది. ఇక తక్కిన కాండలు ఇలాగే వ్రాయండి" అన్న శ్రీవారి ప్రేరణతో ఈ 'సీతాన్వేషణ' వ్రాశాను. ఆదిలాబాదుకు బదిలీ అయి వచ్చాను. బాసర సరస్వతీదేవి దర్శనభాగ్యం కలిగింది. ఇక సుందరకాండ వ్రాయాలను కుతూహలంతో అమ్మవారి స్తోత్రంతో ప్రారంభించాను.

## చాటు దెబ్బ కొట్టింది నిజమా?

'సీతాన్వేషణ' కావ్యారంభాని కుపక్రమించే ముందు ఈ కాండలోని పాత్రలను ఒకసారి సింహావలోకనం చేస్తూ ఆలోచించాను. వాలిని వధించిన తీరు మళ్లీ మళ్లీ చదివినా నాకెందుకో మనసొప్పలేదు. వాల్మీకిచే 'సత్య ధర్మ పరాక్రమ' అని ప్రస్తుతింపబడిన వీరాధి వీరుడైన శ్రీరాముడు, యుద్ధరంగంలో విరథుడై విజితుడైన రావణుడిని పట్టి చంపక 'నేడు పోయి అలసట తీర్చుకొని రేపు రా' అన్న రణనీతి వర్తనుడైన రఘువీరుడు మాటునుండి బాణము వేయునా? ఇది వాల్మీకి వ్రాయునా? ఇదేమైనా ప్రక్షిప్తమేమో! ప్రక్షిప్తాలు మూల విషయాన్ని తారుమారు చేసినా చేయవచ్చునేమో! సంపాతి కొడుకు సుపార్శ్వుని ఘట్టం ప్రక్షిప్తమన్నారు. అది వ్రాయడం మానేశాను. మంచిగా యాచించినంత మాత్రాన బలవంతంగా పట్టుకపోతూండగా అసహాయ స్థితిలో దీనాతిదీనంగా ఆక్రందిస్తూన్న అబలను చూచి జాలి గొనక మానవత్వం చచ్చి, దుర్మార్గుడైన రావణున్ని ఎదిరించి, ఆపన్నురాలైన సీతను రక్షించుటకై పరాక్రమించని సుపార్శ్వుని పాత్ర నాకు నచ్చలేదు. అందుకే అది వ్రాయలేదు. అంతమాత్రాన లోపం ఏమీ కనుపించలేదు. ఇలాగే వాలిని మాటునుండి కొట్టడం ప్రక్షిప్తమై యుండునేమో! సందేహాలున్న కొన్ని చోట్ల చెప్పడం మానివేస్తే కూడా కథాగమనం సాగుతుంది.

వాలి వధ గురించి ఆలోచిస్తూ నేను కావ్యమే ఆరంభించలేక ఎన్నాళ్లో గడిపాను. సందేహం తీరక స్ఫూర్తి కలుగలేదు. ఒకరోజు రాత్రి సుమారు నాలుగు గంటలకు ఒక చిత్రమైన దివ్యస్వప్నం కలిగింది. అది అరణ్యం. అందునొక ఉన్నత ప్రాంతం. అచట ఒక గుడి అందులోనుండి నేను చూస్తున్నాను. ఒక దివ్యమైన వృషభ రాజాన్ని ఒక భయంకర క్రూరమృగం (సింహం) వెంటాడు తూంది. వృషభం భీతిల్లి పరిగెత్తుతూ రక్షణకై నేనున్న గుడిపైపు వస్తుంది. మృగం వెంటాడుతూ వస్తుంది. వృష భం గుడిలోనికి జొచ్చుకొని వచ్చింది. మృగం లోనికి వస్తుందేమోనని వృషభ రక్షణకై దేవుడిని ప్రార్థిస్తూ తత్తరపడుతూన్న నన్ను ఒక అర్చకస్వామి సమాధాన పరు స్తున్నాడు. మృగం గడపదాటి గుడిలోనికి ప్రవేశించలేక పోయింది. వృషభానికి రక్షణ దొరికింది. ఆ తర్వాత నా స్వప్నం తేలిపోయింది. నేను మేల్కొన్నాను. నిజంగా నాకది మేల్కొలుపే. మనస్సు తేలికపడి ఉల్లాసంగా ఉంది. నాకేదో ఊహ తట్టినట్లనిపించింది. వాలి వధ గురించి నా సందేహం తీరిపోగానే కావ్యారంభానికి పూను కొన్నాను. తలప్రక్కనే పెట్టుకున్న నోటుబుక్కు పెన్నూ తీసికొని అమితోత్సాహంతో ఆత్మవిశ్వాసంతో—

"రామ లక్ష్మణు లడవి దారిన భూమి తనయాన్వేషణార్థము
కావలందున కోసలందున కాలి నడకన సాగిపోవుచు—"

అని సీతాన్వేషణ కావ్య రచన సాగిస్తూపోయాము. సందేహం తొలగగానే రచన సాఫీగానే సాగింది. ఇది దైవ ప్రేరితమే. సందేహం లేదు. కాకపోతే సందేహ నివృత్తి కోసం ఎన్నాళ్లో ఆలోచిస్తూ కావ్యారంభమే చేయలేని వాణ్ణి ఈ మేలుకొలుపుతో మలుపు తట్టి అడ్డు తొలగిన జలధారలా రచన సాగించ కలుగుతానా? అంతా రామానుగ్రహమే! రామ సంకల్పమే! ఏది ఏమైన రాముడు వాలిని వధించాడు. సుగ్రీవుణ్ణి రక్షించాడు. ఇది నగ్నసత్యం. వాల్మీకి సమ్మతం. కాని చెట్టు చాటునుండి కొట్టే పని తప్పింది. ఇది తప్పించటమే నేను చేసిన పని. చాటు దెబ్బ తప్పించుట తప్పివ మగునేని క్షంతవ్యుడను. వాల్మీకి ననుసరించటమే నా అభిమతం కనుక చాటు దెబ్బ ప్రక్షిప్తమేమోనని ఈ చిన్న మలుపుకై ఎన్నో రాత్రులు ఆలోచించాను.

## చాటు దెబ్బ కాదు – ఎదురు దెబ్బే :

పోరునుండి తన శరణాగతుడై పారి వచ్చే సుగ్రీవుని వెంటాడుతూ ఎదురువడ్డ వాలిని ఎదురుగానే నిలిచి హెచ్చరిస్తూ కొట్టినాడనీ, అట్లగుట బాణం సూటిగా వాలి ఎదలో గ్రుచ్చుకొన్నదనీ శరణాగత రక్షణమూ శత్రువును వధించటమూ రెండూ జరిగి పోయాయని రాముని శౌర్యోచిత క్షాత్ర ధర్మాన్ని స్ఫురింప జేస్తూ చెట్టు మాటున దాగి కాచే అవసరం లేకుండా చేశాను. "వాలి తొమ్మున నాటె

నమటచే వెనుకనుండిగాని ప్రక్కలందుండిగాని వేయలేద నియు నెదురు ముఖముగా నుండియే బాణము వేసెననియు నంతవరకు చాటుగ నుండినను బాణము వేయునపుడు బయ లనే యుండెననియు నెఱుఁగనగు" అని ఆంధ్ర వాల్మీకి శ్రీ వాసుదాస స్వామిగారు కూడ అభిప్రాయ పడినారు.

చాటుమండి వేసినా రొమ్మున సూటిగా గ్రుచ్చుకొను నట్లు వేయవచ్చునని అనవచ్చు. కనుక తన శరణాగతుడై వస్తున్న సుగ్రీవుని వెంటాడుతూ చంపవస్తున్న వాలిని రాముడు ప్రాణాలు కాచుకొమ్మని హెచ్చరించటం వాలి సాలవృక్షంతో ఎదుర్కొవటం రామబాణం దానిని ఛేదించి వాలి రొమ్మున గ్రుచ్చుకొనటం వాలి కూలిపోవటం కల్పిం చాము. చాటు దెబ్బను సమర్థించే వాలి సుగ్రీవుల మొదటి పోరును, గజపుష్పమాలను గురించి చెప్పటం మానివేశాను. రావణుడు సీతను ఎడమచేత కురులు కుడిచేత ఊరువులు పట్టుకొని రథముపై నెక్కించుకొని పోయాడని వాల్మీకి వ్రాసినా దానికి భిన్నంగా భూమిని పెకలించుకొని సీతతో వెళ్ళిపోయాడని కొందరంటారు. (అధ్యాత్మ రామాయణం) అది అవాల్మీకమైనా నమ్ముతారు. ఆక్షేపించరు. అది వారి భక్తి భావం. వాలి వధా విధానంలో నేను చేసిన మలుపు ఒకవేళ అవాల్మీకమైతే అలాంటి భక్తి భావంతోనే ఆదరించ దగినదిగా భావిస్తాను.

ఎదురు దెబ్బ వాల్మీకమే :

వాల్మీకం ప్రకారం రాముని సంగతి తారవల్ల ముందుగా తెలుసుకోవటమూ, ధనుష్టంకారమూ హెచ్చరిక లాంటివే. పరాక విషయం వాలికి గుణపాఠం నేర్పాలి. వాలి వధ వివాదాస్పదం కాకూడదు. అందుకే బాణం తొమ్ములో కొంతవరకే గ్రుచ్చుకొనునట్లు వేశాడు రాముడు. వాలి పడిపోగానే వాలిని సమీపించాడు. చాటు దెబ్బ కొట్టి ఉంటే అంత ధీవిగా తనకు తానై వాలి ముందుకు వెళ్లునా? ఈ అంశాలన్నీ వాల్మీకం ప్రకారం కొట్టింది చాటు దెబ్బ కాదని ఎదురు దెబ్బేనని సమర్థిస్తున్నవి. కాని-

వాలి ఆరోపణలు, రాముని సమాధానాలు. (ఎదురుగా వచ్చిఉంటే నిన్ను యమపురికంపిఉండే వాణ్ణి అని వాలి, నీవు మృగానివి, నిన్ను మరుగునమండి చంపినా తప్పులేదు అని రాముడు మొ॥) చాటు దెబ్బను సమర్థిస్తూ విషయాన్ని తారుమారు చేస్తున్నవి. చాటు దెబ్బ రాముని పౌరుషానికి ప్రతిష్ఠకు తగినపని కాదని ఒక వివాదమున్నది. అది తొలగవలె.

భారతంలో రథమెత్తుకుంటున్నాను కొంచె మాగుమన్ననూ ఆగక బాణంతో కొట్టి చంపుతాడు అర్జునుడు కర్ణుడిని. ద్వంద్వ యుద్ధంలో మూర్ఛితుడైన సాత్యకిని భూరిశ్రవుడు వధించబోగా అర్జునుడు అస్త్రంతో అతని

హస్తం ఖండిస్తాడు. యుద్ధ నీతి ఎలా ఉన్నా సత్యధర్మ పరాక్రముడుగా, పరమపురుషుడుగా, పూర్ణ వ్యక్తిత్వం గల వాడుగా వర్ణింపబడ్డ రామునిపట్ల ఈ రెండు విధానాలు వర్తించకూడదు. వాలి నిరాయుధుడు కాకూడదు. ప్రమత్తుడు కాకూడదు. అందుకే ఈ మలుపు.

రాముని బలం :

ఎదురువడ్డ పదునాల్గు వేల సైన్యంతో వచ్చిన ఖరాదులను ఏకైక వీరుడై వధించిన రాముని అస్త్రకౌశలం, ఘోర భయంకర విరాధ కబంధాదుల ఖండించిన రాముని భుజ బలం, ఖడ్గబలం, శ్రీకృష్ణుడు చిన్ననాడు చిటికెన వ్రేలిపై గోవర్ధన మెత్తినట్లు, నూనూగు మీసాల ప్రాయంనాడే శివ ధనుర్భంగం చేసిన శ్రీరాముని దివ్య భుజబలం అమోఘం, అప్రతిహతం. కాంచనమాల ప్రతియోధుని సగం బలాన్ని హరిస్తుంది అని వాల్మీకి అనలేదు. సుగ్రీవుడు ముందే రాముని అస్త్ర భుజ బలాలను రెంటినీ పరీక్షించాడు. వాలి కన్న రాముడే బలిష్ఠుడని తెలుసుకుంటాడు.(ఆంధ్ర వాల్మీకి) వాలి రెండు చేతులతో దుందుభి కళేబరాన్ని విసరివేసినాడు. కాని రాముడు కాలి బొటనవ్రేలితో ఆ కళేబరాన్ని పది యోజనాల దూరం విరజిమ్మినాడు. ఎందుదైనా చిమ్మింది కాలి బొటన వ్రేలితో, దూరం పదంతలు. ఏడు సాల వృక్షాలను ఒకే బాణంతో ఒకే వ్రేటున కూలవేసిన రాముని అస్త్ర బలం చూచి సుగ్రీవునికి నమ్మిక కుదిరింది - అయితే-

## చెట్టు చాటున దాగిందెందుకు?

అస్త్రవిద్య నెరుగని వాలి అస్త్రకోవిదుడైన రామునికి ఎదురుపడి యుద్ధం చేయలేక తప్పుకొనవచ్చు. ఎలాగైనా వాలిని బయటికి రప్పించాలి – చంపాలి. ఇది తన కోసం, తన మిత్రుని కోసం, ధర్మ సంరక్షణ కోసం అవశ్యం జరిగి తీరాలి. తన కోసం రాముడు బాణాలతో పొంచి ఉన్నాడని, ముందు తెలిస్తే వాలి బయటికి రాకపోవచ్చు. అందుకే వ్యూహం పన్నిపంపి వచ్చింది. చెట్టు చాటున దాగింది వాలికి భయపడి కాదు. వాలి, ఖర విరాధ కబంధ రాక్షసుల సంహరించిన రామాస్త్రాలకు భయ పడి బయటికి రాడని. అయితే శస్త్రాస్త్ర కోవిదుడైన రావణుని వాలి ఒకప్పుడెలా పట్టుకున్నాడు అంటే ఒంటరిగా చిక్కినప్పుడు పట్టుకొన్నాడు కాని ఈ ప్రసక్తి వాల్మీకంలో లేదు. మదగజం కొదమ సింహాని కెదురుపడి రానట్లు వాలి తనంత తాను ముందుకు రాడు. సింహమే గజంపై దూకటానికి పొంచి ఉన్నట్లు రాముడు చెట్టు చాటున కొంతసేపు పొంచి ఉన్నాడు. సమయం వచ్చినప్పుడు బయల్పడి వాలిని ముఖాముఖి ఎదిరించి వధించాడు. వాలి వీరుడు, అహంకారి. పారిపోడు. సంధికి రాడు. శరణు వేడడు. నా దగ్గరికి వచ్చి ఉంటే రావణుడి పీడ్చుకొని వచ్చి నీ సీతను నీకు తెచ్చి ఇచ్చే వాడిని అని అంటాడు. ఇది వాలి తత్వం. వాల్మీకి వాలి శౌర్యాన్ని బాగా ఉగ్గడించాడు. ఏమాత్రం వ్యవధి చిక్కినా రామాస్త్రాలకు

జడుపక ప్రతిఘటించేవాడు. అప్పుడు వాలి రాముల యుద్ధం పైన చెప్పిన విధంగా జరిగి ఉండేది అని ఊహించాను. నా ఊహ తప్పు కావచ్చు కాని ఎదురుపడి ఎంతటి ఘోర మారణాయుధంతో ఢీకొన్నప్పటికీ అప్రతి హతమైన రామా స్త్రానికి తునా తునకలై వాలి హతుడయ్యే వాడు. మరుగున నుండి కొట్టే అవసరం రామునికి లేదని నా భావం.

ఎదురుగా వస్తే రాముడు చంపలేడన్న అనుమానం రాకూడదన్న అభిమానం, అభిమతం నన్నిలా వ్రాయించింది. రసౌచిత్యాలుంటే కొన్ని దొసగులున్నా వాటిని పాటించరు గదా! చెరుకు గడ వంకరైనా గణుపులున్నా తీపిదనం ఉండనే ఉంటుంది గదా! వాలి వధ చాటు దెబ్బతో గాదు, ఎదురు దెబ్బతోనే జరిగింది అని నా నమ్మకం. అది అవాల్మీకం కాకూడదని నా అభిమతం.

## సీతాన్వేషణ :

రామాయణం ప్రధానంగా కరుణరస ప్రపూర్ణమైనది. ఈ 'సీతాన్వేషణ' (కిష్కింధ కాండ)లో రసాలు చిప్పిలితూ వసంతర్తువు, వర్షర్తువు, శరదృతువు ఈ మూడునూ ప్రకృతి మనోహర దృశ్యాలతో ముప్పిరిగొని హృదయంగమముగా స్పందన కలిగించే భిన్న భిన్న సన్నివేశాలతో నిండునొని ఎక్కడా విసుక్కు తావే ఉండదు. ఇదంతా వాల్మీకి గొప్పతనమూ, పనితనము.

ముఖ్యంగా ఇందులో మన గ్రామ గ్రామములో వెలిసిన మన ఆరాధ్య దైవం, ఎడబాటులో తపించి పోతూన్న సీతారాములను(ప్రకృతి పురుషులను)సందేశకుని రూపములో ఓదార్పు హనుమంతుడు మొదటిసారిగా దర్శన మిస్తాడు. ఇంకా ఇందుల్లో విభిన్న ప్రవృత్తులతో ఎన్నో పాత్రలు కబంధుడు, వాలి, సుగ్రీవుడు, అంగదుడు, తార, శబరి, స్వయంప్రభ, సంపాతి మొదలగు వారు దర్శన మిస్తారు. ప్రతి పాత్రలో ఏదో విశేషం తెలుసుకుంటాము.

రామాయణం నీతిరత్నాకరం. ఎంత ఏరుకున్న తరుగవు. ప్రతి ఘట్టం రసాస్వదం. ప్రతి అంశం కర్మ మార్గాన్ని బోధించే ధార్మిక సందేశం. ప్రతి విషయం వేదాంత గర్భితం. సర్వ శాస్త్ర నిక్షేపం. అరిషడ్వర్గాలచే పతనం కాకుండా మానవాళిని ధార్మిక మార్గాన నడిపిస్తూ లోకైక సంక్షేమాన్ని సమకూర్చే విశ్వజనీనమైన మహా కావ్యం. ఇట్టి మహత్తర కావ్యం జోలికి పోవడం నా వంటి చిన్న కవికి తాహతుకు మించిన పని. అయినా రాముడే నాకు తోడ్పాడ గలడని, రామాయణ పవిత్రతను సంభావించి రస దృష్టితో, కవితా దృష్టితో పాత్రౌచిత్యాలను పాటిస్తూ వాల్మీకీయాని కనుసరణగా నా శక్త్యాను సారంగా ఈ 'సీతాన్వేషణ' వ్రాశాను. "ప్రమాదో ధీమతా మపి" విజ్ఞుల కైనా దొసగులు దొర్ల వచ్చు! ఇక అల్పజ్ఞుడనైన నా మాటెంత?

నా యీ కృతి భర్తయగు జగచ్చక్రవర్తి భద్రగిరి సీతారామ చంద్రమూర్తి అనుగ్రహించి మీకునూ మాకునూ ఆయురారోగ్య భోగ భాగ్యముల నొసంగి ఎల్లవేళల బ్రోచు గాతమని ఈ పుస్తకమును మీ కరకమలముల కందిస్తూ దీనిని సహృదయతతో, కవితా దృష్టితో పఠించి ఆనందిస్తారని ఆశిస్తున్నాను.

" సర్వే జనాః స్సుఖినో భవంతుః "



— నా భద్రగిరి శతకము నుండి

రణమందప్పుడు రావణుండలసి పోరాటంబు సాగించ లే
కను దైన్యస్థితినుండ 'నేడరిగి విశ్రాంతుండవై రేపు ర'
మ్మను ధీరుండవు దాగికొట్టితెటు నీవావాలినిన్ ధర్మ వ
ర్ధన! నమ్మందగునెట్లు? భద్రగిరి సీతారామచంద్ర ప్రభూ!

వాలిన్ మాటున దాగికొట్టెనను దుర్వాదంబు నే నమ్మనో!
ఆలంబందున పారివచ్చి శరణంబర్థించు సుగ్రీవు ప్రా
ణాలన్ దీయగ వచ్చువాలినెదుటన్ బాణంబుతో గూల్చ లే
దా? లోకావనకామ! భద్రగిరి సీతారామచంద్ర ప్రభూ!

నీ కష్టంబుల జూడలేక శివుడే నీకున్ సహాయ్యంబు న
ష్టో కాసక్తి వెసంగగూర్చె హనుమంతుడై అపట్లాటచే
ఈ కాలానికి అంజనేయగుడి లేకే గ్రామమున్ లేదు సీ
తా కాంతా! శివవంద్యా! భద్రగిరి సీతారామచంద్ర ప్రభూ!

నీవే దేవుఁడవై విధిప్రళయమం దేలాగునంజిక్కి తో
దేవా! తెల్పగదయ్యా! మర్త్యుఁడను సందేహాత్ముఁడన్ నీదు లీ
లావై చిత్ర్య మెరుంగ! నీకయిన ప్రారబ్ధంబు తప్పింప రా
దా! వైకుంఠ నివాస! భద్రగిరి సీతారామచంద్ర ప్రభూ!



# ANDHRA PRADESH OPEN UNIVERSITY

Prof. C NARAYANA REDDY
M. A; Ph D.. D. Lit.;
Vice-Chancellor

Somajiguda
HYDERABAD
500 482 A.P.,

Lr No. APOU/UCP/87/743

Dt. 17-8-87

శ్రీ కేశవాచార్యులుగారికి,

మీరు పంపిన 'సీతాన్వేషణ' చదివాను. రామాయణంలోని రసవత్తరమైన ఇతివృత్తాన్ని ఎన్నుకొని మీరు పరమ సరళ భాషలో ప్రవాహ రూపంలో ఉన్న గేయగతుల్లో ఈ కావ్యాన్ని రచించినందుకు సంతోషం. ఇతివృత్తం ప్రఖ్యాతం. మలచిన విధానం మనోహరం. అందుకు మీకు నా అభినందన.

మీ

—సి. నారాయణ రెడ్డి.

శ్రీ కేశవాచార్యులు
చీఫ్ ప్లానింగ్ ఆఫీసర్
ఆదిలాబాదు.



# అభిప్రాయము

రసప్రియ శ్రీ ఖోతేదార్ కేశవాచార్యగారు రచించిన "పితాన్వేషణ" గేయ కావ్యమును అమూల చూడముగా పరిశీలించితిని. ఇందలి చక్కని తెలుగు పలుకుబడులు, మృదు మధుర సంస్కృత సమాసములు, సుకుమార భావములు పండిత పామర రంజకములుగా ఉండి కావ్యశోభను పెంచుచున్నవి.

గ్రంధకర్త వాల్మీకి రామాయణమును క్షుణ్ణముగా పఠించినారు. అవాల్మీకీయ ఘట్టములు లేవు. యథా మాత్రకముగా స్వతంత్ర ఫక్కిలో వ్రాసినారు.

వాలిని శ్రీరాముడు చాటుననుండి చంపెనను విషయము ప్రక్షిప్తము కావచ్చునని పీఠికలో శంకించినారు. అది ప్రక్షిప్తముగాదు. రాముడు దొంగ చాటుగ వాలిని చంపలేదు. వాల్మీకి అట్లు చెప్పలేదు. లోకములో వాడుకయందున్న గాథ ఇట్లున్నది. "ఇంద్రుడు వాలికి ఒక కాంచన దామము ఇచ్చెననియు, దాని ప్రభావము వలన అతని

వెదిరించు శత్రువు బలములో సగము వాలికి వచ్చుననియు; అది యెరిగిన శ్రీ రాముడు చెట్టు చాటున దాగి వాలిని బాణముతో గొట్టి చంపెననియు అది ఆక్షేపణీయ మనియు కలదు". ఇది సరి కాదు. వాల్మీకి ఎచటను ఆ కాంచన దామమును-దాని ప్రభావమును చెప్పలేదు. రామాయణమున ఇట్లున్నది.

"రాముడు సుగ్రీవునితో కలసి కిష్కింధకు పోయి ఊరి బయట గహనమైన వనములో ఇతరులకు కనబడకుండ చెట్ల చాటున ఉండిరట". "వృక్షైరాత్మాన మావృత్య వ్యతిష్ఠన్ గహనే వనే" సుగ్రీవుడు మాత్రము వెలికివచ్చి వాలితో యుద్ధము చేయుచు అతని తీవ్ర ముష్టిఘాతములకు తట్టుకొనలేక ఆర్తితో రాముని పైపు చూడగా రాముడు గత్యంతరం లేక మిత్రుని రక్షించుటకై తీవ్ర బాణముతో వాలి వక్షమునకు కొట్టెనట"

"తతోధనుషి సంధాయ శరమాశీ విషోపమమ్

.... .... ....

రాఘవేణ మహాబాణో వాలివక్ష సిపాతితః"

చాటున ఉండి బాణము వేసినచో సూటిగా వాలి వక్షమున దూరదు. కావున ఎదుటనే ఉండి రాముడు బాణము వేసి

యున్నాడు. ఆగ్రహోన్మత్తుడైన వాలి సుగ్రీవుని పైననే దృష్టి నిలిపినందున ప్రక్కన ఉన్న రాముని చూడలేదు అని భావింపవలెను. పీఠికలో శంకించినను కావ్యమున సరిగనే వ్రాసినారు.

పీఠికలో పంపాసరోవరమును గూర్చి చర్చించినారు. ఇప్పటి వరకు లభించిన ఆధారములను బట్టి హంపీ ప్రాంతమే పంపా సరోవర స్థానమని వేంగీ ప్రాంతము కాదని చెప్పవచ్చును.

సుప్రసిద్ధ ఆధునిక కన్నడ రచయిత శ్రీ కె.వి. పుట్టప్ప "రామాయణ దర్శన" అను పేరుతో సుందరముగ గేయరూప రామాయణ కావ్యమును రచించిరి. దానికి జ్ఞానపీఠ అవార్డుగూడ లభించినది. తెలుగులో శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు "జనప్రియ రామాయణము" అను పేరుతో గేయకావ్యమును ఒక్కొక్క కాండగా ప్రకటించినారు. అవి అనేక రామాయణాల సారముగ విస్తృత రూపమున వ్రాయబడినట్టిది. శ్రీ కేశవాచార్యులుగారు మూలాను సారముగ సంక్షిప్త రూపమున ఈ రామాయణమును రచించుచున్నారు. ఇది సరళసుందర శైలిలో మనోహరముగ ఉన్నది. ఇట్లే సుందరకాండ-యుద్ధకాండలనుగూడ రచించి ఆంధ్రలోకమునకు అందింపగలరని ఆశిస్తున్నాను.

విదేశీయ నాగరికతా వ్యామోహమున బడి భారతీయ మహాసంస్కృతిని విస్మరించుచున్న నేటి హైందవ సమాజమునకు రామాయణ మహాభారతగాథలే పునరుజ్జీవన హేతువులు. ఈ పరమార్థమును గ్రహించిన గ్రంథకర్త రామాయణ రచనను చేపట్టినందుకు వారిని అభినందించుచున్నాను.

అలంపూరు
విభవ-చైత్రము

—గడియారం రామకృష్ణశర్మ
మాజీ కార్యదర్శి
ఆంధ్ర సారస్వత పరిషత్తు
హైద్రాబాదు



# రసప్రియ రామాయణం

"చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం
ఏకైక మక్షరం ప్రోక్తం మహా పాతక నాశనం"

ప్రాచేతసుడు శ్రీరామకథకు శ్రీ కా ర ం చుట్టిన ముహూర్తబలం ఎట్టిదోకాని ఈనాటికీ ఎందరో వాల్మీకులు పుడుతూనే ఉన్నారు. రామకథను ఏకదేశంగానో అనేక దేశంగానో రచిస్తూనే ఉన్నారు. కారణం: కవియైనవాడు తాను దర్శించిన ప్రకృతి సత్యాన్ని అపుడు తనగుండెలో గూడు కట్టుకున్న భావాన్ని లోకానికి చెప్పవలెకనుక.

పాశ్చాత్యులకు కవిత్వమంటె వర్ణనాత్మకమైన విషయమేగాని కథగాదు. మనకు కథలేకుండా కవిత్వం లేదు. ఇది మనకు వారికి గల భేదం. ఉద్యానపాలకునికి క్షేత్రం వలె, చిత్రకారునికి భిత్తి వలె, నటునికి రంగస్థలం వలె భారతీయుడైన కవికి ఒకవస్తు వవసరం.

క్షేత్రం ఎంత మంచిదైతే కర్షకుని పంట అంత బాగా దిగుతుంది. తోటమాలి వనం అంతఅందంగా పుష్పిస్తుంది. భిత్తి ఎంత చక్కగాఉంటే చిత్రకారుని రచన

అంతమనోహరంగా ఉంటుంది. కవి విషయంగూడా అంతే. అతడు చేపట్టిన ఇతివృత్తం ఎంత ఉదాత్తమయింది అయితే కృతి అంతగా రాణిస్తుంది. అందుకే వాల్మీకి రామకథను ఎన్నుకున్నాడు. మురారి కవి శ్రీరామునివంటి మరొక ఉదాత్తమైన నాయకుని చూపండి. నేను అతనిపైననే కావ్యం రచిస్తానంటాడు. కంకంటి పాపరాజు కవియై పుట్టిన తర్వాత శ్రీరామకథ రచించక ఇతరకథ లెన్నిరచిస్తె ఏం లాభం అంటాడు. శ్రీ విశ్వనాథవారు తమ కల్పవృక్షంలో మళ్లీ ఈ రామాయణం ఎందుకని ప్రశ్నించుకుని ప్రజ లందరూ తిన్నఅన్నమే మళ్లీ తింటున్నారు. చేసిన సంసారమే మళ్లీ చేస్తున్నారు. ఎందుకు? ఈ విషయంలో ఎవరి అనుభూతి వారిది కనుక! అంటాడు. అందుచేత ఈ రస ప్రియుని రచనకూడా అంతే.

రామాయణ పాత్రల విషయంలో తన అవగాహన తనకున్నది. అందుచేత తాను దర్శించిన సత్యాన్ని చెప్పించటానికే తెలుగువారి దైవం భద్రాది రామయ్య ఇతనితో ఈ రచన చేయించినాడు.

కబందుడొక విచిత్రజీవి. వానికి బొర్రనేగాని బుర్రలేదు. కనిపించిన వారినల్లా పట్టుకొని కరకరలాడించటమే వానిపని. చివరకతనిని దహనం చేస్తేగాని పూర్వజ్ఞానం కలుగలేదు. ఈ కబంధునిలో రసప్రియగారు అధునిక కబంధులను దర్శించినారు. మీరుగూడ చూడండి.

"రామాయణములోన రాక్షసులు పెక్కండ్రు
గాని కబంధ రాక్షసుడొక్కడే వాడు.
కలరు అజగరవృత్తి గల కబంధులు నేడు.
కలికాలమిది కబంధులు పెక్కునరులందు.

XX XX XX

నరులందు నేడు కొందరు కబంధులు గలరు
వంచనా శిల్పమను వలపన్నెదరు వారు
వారివలలో చిక్కి వదలించు కొనలేరు"

అని రసప్రియగారి అనుభవం. ఇతని నీ విధంగా శపించినవాడు స్థూలశిరుడనేముని. స్థూలశిరుడనగా పెద్ద తలకాయ గలవాడుగదా? ఈ పెద్ద తలకాయలవారు తయారు చేసిన తలలేని వారీనాటి సమాజంలోగూడా లేకపోలేదు. అటువంటి వారిని కొంత కఠినపద్ధతిలోనే సంస్కరించ వలసి ఉంటుంది. కాని సంస్కరిస్తేమాత్రం వారు సమాజానికి ఉపయోగ పడకపోరనేది ఈ కబంధుని జీవిత సందేశం.

పేరునుబట్టి చూస్తే సుగ్రీవుడు మంచిగొంతు కలవాడు. హనుమంతుడు చక్కని దవడలు కలవాడు. మంచి గొంతు స్వరమాధుర్య మార్దవానికి, చక్కని దవడలు స్పష్ట

మైన ఉచ్చారణకు సంకేతాలు. అందుచేతనే శ్రీరాముడు హనుమంతుని మాటలకు ఎంతో ముగ్ధుడైనాడు.

వాలికి ఒకవేళ వాలవికారం ఏదైనా ఉన్నదేమో, ఇపుడుకూడా అటువంటి శిశువులు అక్కడక్కడ పుట్టటం కద్దు కాని రామాయణ విశేషాలలో శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు సుగ్రీవాదులు వానరులుకారు. వారుగూడా ఒకతెగ నరులే అంటాడు. అలాగే జాంబవంతుడు ఎలుగుబంటుకాదు. సంపాతి జటాయువులు పక్షులుగారు. ఈనాడు మనకు ఖల్లూకపుపట్టు, గ్రద్దచూపు అనే జాతీయాలున్నవి కాబట్టి ఆయా జాతుల వారిలో ఆయాజంతువుల లక్షణాలు గుణాలు, పక్షుల లక్షణాలు గుణాలు కొన్ని శారీరకంగాను మానసికంగాను కనిపించవచ్చు.

ప్రాచీన జాతులలోని మానవులు తమ గుణాలకు జంతువులను సంకేతంగా స్వీకరించినారు కాబట్టి వీరు అట్టి వారు అనవలె.

నేడు భూగోళంపైగల నీగ్రోలు _ శ్వేతజాతీయులు ఎపిస్కిలు _ ఇండియనులు _ జపానీయులు అందరూ మనుష్యులే అయినా ఆకార వికారాలలో వారి నడుమ స్పష్టమైన భేధాలున్నవిగదా! పురాణ కాలంనాటి యక్ష రాక్షసాదులు గూడా అంతే అనవలె. రసప్రియగారు హనుమంతుని పాండిత్యాన్ని ఒకటికి రెండుసార్లు_

పీఠము వేసట్టలేదు. అందుకొరకే వారాదర్శ మూర్తులైనారు. ఆరాధింపబడుతున్నారు. రామాయణం పవిత్ర కావ్యం అయింది.

ఆ కావ్యంలో వరుసలు మార్చుకుని వంతులతో కాపురం చేసిన తారలో రసప్రియగారు ఉమర్ ఖయ్యాంగారి తత్వాన్ని దర్శించినారు.

ఉమర్ ఖయ్యాంగారు లెక్కతప్పినవాడు గాదు. తన గూఢగుడారం ఎరిగినవాడు. వేదాంత సిద్ధాంత ప్రకారం పరతత్వాన్ని అవగాహన చేసికొని సత్యాన్ని దర్శించినవానికి సంచితం నశిస్తుంది. ఆగామి అంటదు. కాబట్టి అతనికిక రేపు లేదు. ఉన్నదంతా వర్తమానమే. అనగా పునర్జన్మ లేదు. అనుభవానికిక శేషజీవితమే మిగిలిఉంటుంది. అందుచేత అశాశ్వతమైన ఆ జీవితాన్నిక అతడేవిధంగానైనా గడపవచ్చు.

శ్రీకృష్ణుడు దాన్ని లోకాని కాదర్శంగా గడపమంటె ఖయ్యాముగారాదర్శంపై మన్ను పోసిరి. అందుబాటులో ఉన్న అందాన్ని అనుభవించు అంటాడు. అయితే తార ఆనందానుభవం వలచిందికాని రేపు లేనిదేనా! ఈమెను మనం వ్యవహారవేత్త అవగలం గాని తాత్వికురాలిగా గుర్తించగలమా!

ఈలాగే రసప్రియగారిందులో కొల్లేరును పంపా సరస్సని మరో క్రొత్త విషయం ప్రతిపాదిస్తున్నారు. ఇప్పటికేలంక పైన రావణుని లంక అదిగాదు. ఇక్కడనే గోదావరి లంకలలో అది ఒకటి కావలెననే వాదంఒకటి ఉంది కాబట్టి ఇది దానికి దగ్గరగా ఉంది. ఈ విషయం ఇంకా ముందు పరిశోధనలో నిరూపింప బడవలసిఉంది.

రసప్రియగారిందులో ప్రవేశపెట్టిన హంసమిథున వృత్తాంతం మరో మనోహర కల్పన – ఎంతవారికిని విధి బలీయం అనివార్యం అను సత్యాన్ని రమ్యంగా చాటి చెప్పినారు.

రామాయణంలో పైవిధంగా స్థలకాలాల పైననేకాక శ్రీరాముని పైననే అతడు అరణ్యవాసంలో మాంసం తినెనా! శబరి ఎంగిలి గ్రహించెనా! వాలిని చెట్టు చాటునుండి ఏల చంపెను? అని అనేక సందేహాలున్నవి.

భక్తుని కాపద కలిగినపుడు భగవంతుడేవిధంగా ఉపేక్షింపలేడో అలాగే అతని లీలలపై అపవాదులు పడినపుడు భక్తులుగూడా సహించలేరు. వానికేదో విధంగా సమాధానం చెప్పే ప్రయత్నం చేస్తూనే ఉంటారు.

రసప్రియగారు కిష్కిందలో వాలివధకు ఒక చక్కని స్వప్నపరిష్కారం చూపినారు. స్వప్నంలో అతనికి ఒక ఎద్దును తరుముతూఉన్న సింహాన్ని చంపిన వీరుడు కని పించినాడు. అంబారవంతో గానంచేసే వృషభం సుగ్రీవునికి అమాయకమైన ఆ సాధుజంతువును హింసింప నెంచిన సింహం వాలికి చక్కని ప్రతీకలు. స్వప్నంద్వారా కవి గారు దర్శించిన పరిష్కారం "కవయః క్రాంతదర్శినః" అనే లక్షణానికి చక్కగా సరిపోతుంది కాబట్టి రామాయణా న్నంతా వీరిదేవిధంగా పాత్యేగేయేచ మధురంగా పూర్తి చేయవలెనని ఆశిస్తున్నాను.

—ఇట్లు

తేది. 17-12-1987 సాహిత్యారాధకుడు

వాణీసదనం —కపిలవాయి లింగమూర్తి

విద్యానగర్ కాలనీ ఎం.ఒ.ఎల్.

నాగర్‌కర్నూల్ లెక్చరరు



# రసప్రియం - రసలహరి

రసప్రియ శ్రీ కేశవాచార్య కవిగారు చేయి తిరిగిన రచయితలు; ప్రతిభావ్యుత్పత్తులు గల కవులు. పద్యం, గేయం, వచనకవిత మూడును వ్రాయగల సమర్థులు. వీరి కవిత్వము వాక్పుష్టి కలిగి మృదుమధురమై ద్రాక్షాపాక మున నొప్పుచు అలతిఅలతి పదములతో ఉదాత్త భావములతో అలరారుచుండును. వీరి ప్రస్తుత కావ్యం సీతాన్వేషణ. ఇందలి కవిత కరుణరసభరితమై హృదయ స్పందన కలిగిస్తూ రసావేశంతో సెలయేటిలా సాగిపోతుంది. ఇందలి ప్రతిఘట్టం ప్రతిసన్నివేశం మనోజ్ఞమై కల్పనాచమత్కృతు లతో శోభిల్లుతూ పాఠకులనాకట్టుకుంటున్నది. వీరురచించిన గ్రంథములు ఎక్కువగా భక్తిరసప్రధానములే అయినా అక్కడక్కడ వీరి కవిత సామాజికస్పృహ కలిగి దేశ కాలానుగుణంగా సాగిపోతుంది.

ఆబాలగోపాలమునకు అర్థమగునట్లుగా వీరు గేయ రామాయణమును రచించటం ఆనందదాయకం. సరళమై, శ్రావ్యమై, సకలార్థసిద్ధిప్రదాయకమై రసమాధుర్యముతో వెసలారు రసప్రియ రామాయణము సర్వజనాదరణ పొంద గలదని నమ్ముతూ, శ్రీరామచంద్రమూర్తి వీరికి ఆయు రారోగ్య భోగ భాగ్యముల ననుగ్రహించుగాక! అని ప్రార్థిస్తున్నాను.

ఖమ్మం —యర్రం విశ్వనాథంగుప్త

ఖమ్మంజిల్లా విశ్వ హిందూపరిషత్ పూర్వాధ్యక్షులు

# కృతజ్ఞతావిష్కరణ

నా యీ గ్రంథముద్రణకు ఆర్థిక సాహాయ్య మందించి ధార్మిక రచనలకు నన్ను ప్రోత్సహించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము పాలక వర్గము వారికి నేనెంతయు కృతజ్ఞుడను. ఇట్టి సహాయము లేకుండినచో ఈ పుస్తకము అచ్చువేయడము సాధ్యము కాకపోయేది.

నాయీ కావ్యానికి దయతో సహృదయతతో తమ అమూల్యాభిప్రాయములొసగినన్నెంతయు ప్రోత్సహించిన పెద్దలు సుప్రసిద్ధ కవిపండితులు శ్రీ గడియారం రామకృష్ణ శర్మ గారికిని, ఓపెన్ యూనివర్సిటీ అధ్యక్షులు మహా కవులు డా॥ సి నారాయణ రెడ్డిగారికిని, విఖ్యాత విద్వత్కవులు శ్రీ కపిలవాయి లింగమూర్తి గారికిని, బహుగ్రంథ కర్తలు, బహుభాషజ్ఞులు, కవి భూషణ, శ్రీ యర్రం విశ్వనాథంగుప్తగారికిని నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములు.

పన్నెండేండ్ల బాలుడైనా భావస్ఫురితంగా అందంగా ముఖచిత్రమువేసి యిచ్చిన మా ప్రియతమ దౌహిత్రుడు చి॥ ఎం. వేంకటాచారికి అభినంద నాశీర్వాదములు.

రచయిత

# అన్వేషణ క్రమము

---

"ఆపదామప హర్తారం దాతారం సర్వసంపదామ్
లోకాభిరామం శ్రీరామం భూయోభూయోనమామ్యహమ్".

---

# తప్పొప్పులు

ముందుగా సరిదిద్దుకొని చదువ ప్రార్థన

| పేజ. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2. | 1 | అకట | అచట |
| 3. | 7 | వీచుట | వీచగ |
| 9. | 7 | విదలిందు | విదలించు |
| 13. | 4 | విదల్చు | వదల్చు |
| 20. | 5 | పోవీను | పోనీను |
| 21. | 5 | నహవాస | సహవాస |
| 22. | 12 | యంను | యందె |
| 24. | 17 | న్మృతి | స్మృతి |
| 40. | 6 | గాండు | గాంచు |
| 60. | 9 | చేకట్లు | చీకట్లు |
| 61. | 9 | పరికి | పలికి |
| 62. | 13 | రగలమందె | జేగలమందె |
| 70. | 6 | సరోపరములో | సరోవరములో |
| 70. | 9 | కడగేగి | కడకేగి |
| 71. | 15 | రపంత | రవంత |
| 72. | 11 | హిమకణ | కంకణ |
| 100. | 15 | నిజమెరుగుడి | నిజమెరుగుట |
| 110. | 5 | కెందుకు | కెందులకు |

| పేజి. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 114. | 12 | కఫివరుడు | కపివరుడు |
| 120. | 7 | వావిని | వాలిని |
| 121. | 1 | దుశ్బలి | దుశ్శలి |
| 122. | 13 | కాంచప | కాంచన |
| 126. | 2 | దిచ్చెదను | తెచ్చెదను |
| 131. | 10 | నేనినె | నేనిచె |
| 132. | 2 | తీరుడను | తీర్చెదను |
| 132. | 2 | అర్చెదను | ఆర్చెదను |
| 132. | 7 | నేమంది | నేనుంటి |
| 132. | 8 | చేబు | చేటు |
| 132. | 10 | ఢీనుడవు | దీనుడవు |
| 132. | 14 | పటవ | పడవ |
| 138. | 17వ పాదం రెండవసారి పడ్డది అదిలేదు. | | |
| 136. | 18 | ఒప్పిరి | బప్పిరి |
| 138. | 7 | నీవెంటనే | నీవెంటనునే |
| 140. | 12 | ఐగలు | పొగలు |
| 141. | 6 | అర్పించితిలి | అర్పించితిని |
| 141. | 13 | అతని | ఆతని |
| 143. | 1 | లోవల | లోపల |
| 149. | 3 | తీక్షములై | తీక్ష్ణములై |
| 152. | 12 | జోడు | జోదు |
| 154. | 13 | జోడు | జోదు |

| పేజి. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 157. | 2 | దుందుఖి | దుందుభి |
| 157. | 13 | అండిచుచు | ఆడించుచు |
| 157 | 15 | క ....బరము | కళేబరము |
| 158. | 14 | చూ చూటకును | చూచుటకు |
| 161. | 15 | అంగలది | అంగలిడి |
| 163. | 16 | బయటిని | బయటికి |
| 168. | 3 | నిరాధ | విరాధ |
| 175. | 6 | త్రాడు | త్రాచు |
| 178. | 11 | ని్రదసుతుడు | నింద్రసుతుడు |
| 181. | 1 | ఆత | ఆత్మ |
| 182. | 13 | రాఛ | రాచ |
| 187. | 8 | పొంద | పొంద |
| 190. | 4 | చేపితని | చేసితని |
| 215. | 4 | మొరయు | మెరయు |
| 215. | 8 | వసుధవదు | వసుధవధువది |
| 217. | 14 | తెలియ | తెలియగ |
| 220. | 6 | శోధితుండు | శోభితుండు |
| 222. | 10 | మనిచి | మునిచి |
| 249. | 12 | నరస | సరస |
| 250. | 12 | మరిది | మరది |
| 252. | 5 | శుకముని | శుకముని |

| పేజి. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 256. | 11 | వంచంచి | వంచించి |
| 25'. | 1 | మూ పెంపగుదును | మూ పెంపగుదును |
| 266 | 9 | మనను | మనసు |
| 267. | 6 | వినుమయ్యా | వినుమయ్యా |
| 267. | 10 | మహీతాత్ములకు | మహాత్ములకు |
| 268. | 17 | సుగ్రీసు | సుగ్రీవు |
| 268. | 18 | అగ్రహం | ఆగ్రహం |
| 271. | 18 | అలేమ | ఆలేమ |
| 275 | 2 | నంతుష్టుడై | సంతుష్టుడై |
| 276. | 16 | కిపటికి | కిచటికి |
| 289. | 3 | జాంటవంతు | జాంబవంతు |
| 288. | 6 | చెప్పవయ్యా | చెప్పవయా |
| 288. | 18 | సైనములు | సైన్యములు |
| 294. | 7 | ...క్ర | వక్ర |
| 301. | 3 | క్షణమైన | క్షణమ్మైన |
| 302. | 13 | నిర్వతి | నిర్వృతి |
| 305. | 7 | రింతెన | రింతైన |
| 309. | 12 | స్నయంప్రభ | స్వయంప్రభ |
| 312. | 17 | లత | లతలు |
| 316. | 4 | జేగుచో | కేగుచో |
| 317. | 14 | లెనవేని | లెనలేని |
| 320. | 16 | గావ | గాని |
| 322. | 11 | దుక్షబిలమిద | రుక్షబిలమిది |

# సీతాన్వేషణ

రామలక్ష్మణు లడవి దారిన
భూమి తనయాన్వేషణార్థము
కానలందున కోనలందున
కాలినడకన సాగి పోవుచు
నిరుతి దిశగా మూడు కోసులు
పరుగు పరుగున దాటి పోయిరి.

అంత క్రౌంచాటవిని గని ఒ
క్కింత నెడనెడ చెట్ల నీడల
ఒడలి బడిలిక దీర్చుకొని వడి
వడిగ నడచుచు తూర్పుదిశగా
ముని మతంగాశ్రమము వైపుగ
మూడు కోసులు మరల దాటిరి
కాని గడచిన దండకాటవి
కన్న ఘోరాటవిని గాంచిరి.

అకట క్రూర మృగాలతో ఆ
యడవి యెంతో ఘోరమైనది
అడుగుదీసి యొకింత ముందున
కడుగు వేయగ వీలు కానిది.

కొండ చిలువలు క్రూరమృగములు
దండిగాగల యడవిలో కో
దండపాణులు రామలక్ష్మణు
లండ బాయ రొకళ్లొకళ్లకు.

రాముడే లక్ష్మన్నతోడో!
లక్ష్మణుడె రామన్ననీడో!
"ఒకరి కొకర"ను "తోడు నీడ"ను
ఉక్తి యానాడే జనించెనో!

పవలు రాతురు లనక విసుగక
అవనిసుత కై అన్నిచోటుల
బాగుగా పరికించి వెదకుచు
సాగి పోయిరి వేగ వేగనె.

అన్నపై తాముందు నడువక
చిన్నవానిని ముందుగా
నడువ నిచ్చు నదేమి టకటా!
ఎదద నొచ్చును నడువగా!

అవనిసుత ఎడబాటుచే తన
కశ్రుధారలు పొంగగా
దక్షిణపు పవనాలు వీచుట
తమ్మునకు నవి తాకునో
యనుచు తన దుఃఖమ్ము తమ్మున
కరయనీయక తనకు తా
వెనుకబడి రామన్న తమ్ముని
వెళ్లనిచ్చెను ముందుగా
కాని పిరికి తనమ్ము దీనికి
కాదు కారణ మరయగా!

సుమము త్రుంచిన రెమ్మలో ప
త్రముల జంటగ బోసిగా
జానకీసతి లేక వారల
జంట వెల వెల బోవగా!

ముళ్ల నేరుచు ముప్పులరయుచు
ముందు తమ్ముడు నడువగా
మనసు బరువున అన్న తిన్నగ
వెనుకబడి చను దెంచగా!

అహారహమ్మా అన్నదమ్ములు
అవవి సుతకై వెదుకగా!
అడవిలో అణువణువు వారల
యడుగులను స్పృశియించగా!

భాస్కరుడు తన వాళ్ల దుఃఖము
బాపలేకను క్రుంగగా!
కటకటా! నట్టడవి లోపల
కటిక చీకటి క్రమ్మగా!

సీత వీడిన నాడె వారికి
చీకటుల్ నెరిక్రమ్మగా!
లోక బాంధవు డస్తమించిన
చీకటగునా క్రొత్తగా?

## అయోముఖి

పాతాళమును బోలు
లోతైన నుయ్యొకటి
అగుపించె నద్దాని
నరసి పరికించు తరి

అటనుండి వచ్చెనపు
డతి భయంకరి శూర్ప
నఖ చెల్లెలన అయో
ముఖి యనెడి రాకాసి.

తొడలపై వ్రేలాడు
పొడుగాటి పొట్టతో
విరబోసి కొన్నట్టి
కురులతో పదును కో
రలతోడ విడివి గో
రులతోడ బిరుసెక్కి
నట్టి దేహముతోడ
మట్టి దేహముతోడ

కోట తలుపుల వోలె
నోటి పెదవులు తెరచి
వికృత రూపిణి వికా
విక నగుచు వచ్చినది.
ముందున్న లక్ష్మణుని
మురిసి మోహించినది.
అది అయోముఖి దానిచూడ!
అడలెత్తుపో ఆడవికూడ!

అట్టి వికృతాకారి
అందాల లక్ష్మణుని
చూచి తన చేతులను
చాచినది కౌగిలికి.

అంత సౌమిత్రి వెను
కంజనిడి చీకొట్టె—
కాని ఆ కామాంధ
కనుల కైపెక్కి తా
చిత్తజుని కెరయగుచు కులికె!
సిగ్గు విడి తెగియించి పలికె!

"రార! మామా! రార!
రార! క్రీడిద్దాము!
నీవె నా ప్రియుడవుర!
నేనె నీ ప్రియురాల!

ఎర్రగా బుర్రగా
కుర్రగా ఉన్నావు
నాకు దొరికితి వీవు
నీకు దొరికితి నేను
ఈ శిఖరముల మీద
ఇసుక దిబ్బల మీద
ఈ వనాంతరములో
ఈ గుహాంతరములో
మనమిద్దరము కలిసి
మనువాడు కొందాము!
మన్మథ క్రీడలో
మైమరచి పోదాము.
పొంగారు నా వయసు
రంగారు నీ సొగసు
శృంగార కేళిలో
బంగారమౌ బ్రతుకు.

నను చూడు నా అంద
మును చూడు నా మేని
జిగి చూడు నా వగరు
పొగరు వయసును చూడు!
జాగేలరా మామ రార!
జవరాల నన్నేలుకోర!

కోడె పడుచోడ! నీ
కీడులో జోడులో
తగుదాన క్రీడించ
తడవేల చేసెదుర!
కోడిపుంజై రార మామ!
కోరి వచ్చితి మదనకామ!

చిన్నవాడా రార!
ఇన్నాళ్లు నీ కొరకు
దాచితిని నా కన్నె
దనపు పసిడిని ముదుపు
గా దీని నీ వనుభవించు!
కంతు శర బాధ తొలగించు!"

అని కామమోహాంధ
యై లక్ష్మణుని కౌగి
లించినది హద్దులే
మించినది రాకాసి
కామాతురులకు నేత్రాలు
కన్పడవు ధూమావృతాలు!

పట్టు విదలిందుకొని
పతద్రోసె లక్ష్మణుడు
పడిలేచి రాకాసి
బాహువుల నెగసాచి
భావజుని పెనుబాధ
భరియించగా లేక
దప్పిగొని కీళ్లకయి
తహతహమ్మని నట్లు
ఆకటికి కూటికై
అలమటించిన యట్లు
మాటి మాటికి పైకి
మరులుకొని రాసాగె
మదనాతురులకేటి సిగ్గు?
మతి భ్రష్టకుల కేటి ఎగ్గు?

కోపించి లక్ష్మణుడు
పాపి ముఖభంగమ్ము
గావించ నెంచి తత్
క్షణము ఖడ్గము దూసి
చెనటి రాక్షసి ముక్కు
చెవులు చక్రున గోసె!
అంత మొర్రోయనుచు
అది పరుగులను దీసె!
మోహార్తులకు నాడు భక్తి!
ముఖభంగమే తగిన శిక్ష!

## కబంధుడు

అన్న నా ఎడమ భుజ
మదురు చున్నది నాకు
దిగులు దిగులగు చుండె
మిగుల భయ మగుచుండె.

దుర్నిమిత్తాలెన్నొ
ద్యోతకం బయ్యె ఏ

ముప్పురానున్నదో
ముందు జాగ్రత వలయు.
అస్త్రాలు చేదాల్చుమన్నా!
అప్రమత్తత నుండు మన్నా!

అయిన వంజుల పక్షి
అరచు చున్నది గాన
అని లోన విజయమ్ము
మన కగుట నిశ్చయము.

అని లక్ష్మణుండు రా
మన్నతో నిట్లాడి
దిగులుతో బుగులుతో
దిశలెల్ల పరికించు
నంతలో నా యడవి
యంత దద్దరిలింగ
భీషణంబై కర్ణ
శోషణంబై పెద్ద
ధ్వని వినగ వచ్చినది
పెనుగాలి వీచినది.

ఏమిటీ శబ్దమని
ఎందుండి వచ్చెనని
అన్నదమ్ములు దిక్కు
లన్ని చూచుచునుండ

భ్రమిత చక్రములోన
బంధింప బడినట్లు
క్షణములో రాముల
క్ష్మణులైరి జడులట్లు!

అది ఏమి ఆపదో
ఆ యడవి అడ్డుపడు
వాడెవడు? విధినడు
వాడెవడురా? కాల
మనుకూలమున లేనినాడు!
అంతవారట్లయిరి చూడు!

విధియెట్లు వికటించి
వ్యధ పెట్టునో చూడు!
విధి నడ్డుకొను వాడు
విశ్వమందున లేడు.

ఎల్ల కార్యముల తా
నే చేయగలనంచు
మానవు డహంకార
మదముచే విఱ్ఱవీ
గుచునుండు యెంత మూ
ర్ఖుడు చూడు వాడిసుక
గట్టువలె కొట్టుకొని పోవు!
కాల వాహిని నడ్డబోవు!

చక్ర బంధములో అ
వక్ర విక్రమ పరా
క్రమ వీరు లాభయం
కర కబంధుని బాహు
బంధాలలో జిక్కినారు!
పట్టు వదలించు కొనలేరు!

నరులందు నేడు కొం
దరు కబంధులు గలరు.
వంచనా శిల్పమున
వల పన్నెదరు వారు.

వారి వలలో జిక్కి
వదలించు కొనలేరు.

ఆ రక్కసుని చిత్ర
మైనట్టి ఆకార
మును జూడ భీతి గొ
ల్పును కబంధుడు వాడు.

పర్వతమ్మే చెక్కి
బడినదా యన్నట్లు
పెను బల్ల వలె రొమ్ము
కనుపించు చిత్రముగ

రొమ్ములో ఒక కన్ను
రొమ్ములోనే నోరు
కల దాకబంధునకు
తల లేదు మెడ లేదు.

రొమ్ము సూదుల వంటి
రోమాలతో నిండె!
దాని జూచిన జముని
కైన జారును గుండె!

నోరు విప్పిన పెద్ద
నూయివలె కనుపించు
నాలు కల్లాడించ
నాగు బామని పించు,

ఏన్గు కోరల కన్న
వింత పెద్దవి వాని
కోరలవి చూడగా
గుండె ఝల్లని పించు!

ఒక్కొక్క బాహువది
ఒక్కొక్కయోజనము
దాక చాపుచు మృగా
నీకమును బట్టు కొను.

కదలకను మెదలకను
ఘన పర్వతము వోలె
ఒక చోటనే యుండి
చక చకా వేటాడు.

జింకలను కొంకలను
సింహ కుంజరములను
చిలువలను పులుగులను
ఎలుగు ఎనుబోతులను
తోడేళ్ల కుందేళ్ల
దుప్పి మనుబోతులను
కణితి ఖడ్గమృగాల
కాలు పందుల బట్టి
నమిలి తిను రాక్షసుడు వాడు!
నానా రుచుల్ మరిగినాడు!

రామాయణము లోన
రాక్షసులు పెక్కండ్రు;
కానీ కబంధ రా
క్షసు డొక్కడే వాడు!

కలరు అజగర వృత్తి
గల కబంధులు నేడు
కలికాలమిది కబం
ధులు పెక్కు నరులందు.

అడవిలోనే యుండె
ఆ కబంధుడు నాడు
పట్టణములోనే క
బంధులుండిరి నేడు.

ఆ కబంధునకు బల
మంతయును బాహువుల
యందుంటచే వాని
కవి ఆయుపట్టువులు.

బంధు రాబందులు క
బంధు బాంధవులెంద
రో ప్రవర్ధిలు చుందు
రీ ప్రపంచము నందు
తప్పించుకొన మనకు వశమ
చెప్పగలమ కబంధు పటిమ!

ఒక కబంధుని చేత
సకలేశు దనుజుతో
తికమకలు పడుచుతా
దిక్కు దోచక ఇట్లు

పడరాని పాట్లుబడి క్రుంగె!
పరమాత్ముడై విధికి లొంగె!

"అన్నయా! చూడు! ఈ
అసురు పట్టు విడల్చు
కొనలేక వశము త
ప్పిన వాడ నైనాడ!

అకట! ఉక్కిరి బిక్కి
రైతి, నే నిక వీవి
వశమైతి, నీవైన
వదలించు కొని పొమ్ము!

నను గూర్చి ఆలోచ
నము సేయకిక నీవు
తప్పించుకొని పొమ్ము
ధాత్రితనయను వెదకు.

వదినమ్మ దొరకు ఆ
వల అయోధ్యకు వెళ్ళి
క్షేమముగ పట్టాభి
షేకమ్ము జేసి కొని

రాజ్యమేలుము నన్ను
లక్ష్మణుని మరువకుము!"

అని దైన్యమున తమ్ము
డనినంత రాఘవుడు
తమ్మునకు ధైర్యమ్ము
తగ జెప్పి ఇట్లనియె

"తమ్ముడా! నీవిట్లు
ధైర్యమును విడరాదు
వీరుడవు నీవిట్లు
భీరుడవు కారాదు.

నే నుంటి నీ యంత
దైన్యమేటికి నీకు
శౌర్య వంతుడ వీవు
ధైర్యమును విడబోకు!"

"ఎవ్వరా! మీరిద్ద
రెగు భుజమ్ముల వాళ్లు
బాణాలు ఖడ్గాలు
పట్టుకొని యున్నారు.

నా తిండి కోసమే
నా నోటి ముందునకు
వచ్చితిరి, మీరింక
చచ్చితిరి, మిమ్మింక
పోవీను; మధురాన్న
ములు మీరు, తినివేతు."

అను రాక్షసుని మాట
లను విన్న రామన్న
"ఈ రాక్షసాధముడు
ఈ రూక్ష వీక్షణుడు
అన్నంత పని సేయు"
నని అదురు బెదురుతో
దిశలెగా దిగ చూడసాగె!
దిక్కుతోచక విదికి వీగె!

నాల్క తడబడుచుండ
నయన కాంతులుడింద
మోము వెల వెల బోవ
సౌమిత్రితో ననియె.

నాయనా లక్ష్మణా!
నా కొరకు నీవిట్లు
మృత్యువున కెరయైతి
వెంత దౌర్భాగ్యమది!
సహవాస దోషమెటుబోవు?
క్షమియింతువా నన్ను నీవు!

నా కొరకు నీవు ప్రా
ణాలు బలిపెట్టితివి,
తమ్ముడా! నీ త్యాగ
ధనమునకు సరియేది?

సీత దొరుకక ముందె
ఈ తీరు మన పిద్ద
రము మృత్యువాత బడి
తిమి గదా తమ్ముడా!"

అని ఇట్లు వాపోవు
చును రాఘవుడు బల్కి
తానార్తుడై గూడ
తత్క్షణమె లక్ష్మణుడు

చిర్రుమని లేచి ముఖ
మెఱ్ఱఁబడ నిట్లనును.

"మొండె మున్నది కావి
ఖండించ తలలేను
వీని ఆయువు పట్టు
ఆననమ్మని యెంచి
ఎదనుండు వదనమును
పొదవి పొడిచిన యెడల
విల విలా చేతులను
వీచి మనలను బట్టు
బలమెల్ల వీని చే
తుల యందు కలదన్న!
కుడి నీవు నే నెడమ
వడిగ ఖండింత మిక
క్షణ మాగరాదు, శీ
ఘ్రమ్మె కానీ" యనుచు

లక్ష్మణుం డన్నంత
రాక్షసుడు విని కినిసి

జవురు కొౌన చేతులను
చాచె, నంతనె చరు
తుక్కన తెగెను బాహువులు
కొట్టుకొనె రాక్షసుడు.
సమయజ్ఞతను మించు బలము
జగములో లేదన్న వినుము.

ఎల్లదిక్కులు పిక్క
టిల్ల పెద్దగ నరచి
బాధతో దొర్లిపడి
బోధపడి నట్లాట.

ఒక కంటిలో జాలి
ప్రకటించుచును వాడు
'ఎవరయ్య మీర?' నుచు
వివర మడిగిన యంత

"మాదయోధ్యాపురము
మా తండ్రి దశరథుడు
రాముడీతడు నన్ను
లక్ష్మణుం డనియెదరు

ఇతడు మా అన్ననే
నితవి తమ్ముడ నగుదు.

తండ్రియాజ్ఞను బట్టి
దండ కాటవి దాటి
పంచవటి నుండగా
వంచించి రావణుం
డను వాడు మా వదినె
గొనిపోయె గాన ఈ
యడపు లంతట వదినె
కై వెదకు చున్నాము.
కాని నీ వెవ్వరో
కని వినని ఈ వింత
రూపమేమిటొ మాకు
రూఢిగా వివరించు."
అని లక్ష్మణుండడుగ వాడు!
ఆర్తితో బదులాడి నాడు!

"స్మృతి వచ్చె నాకు స
స్మృతి వచ్చె, వచ్చె స
ద్గతి నాకు మీకు స్వా
గతము సుస్వాగతము!

స్వాములూ! రామ ల
క్ష్మణులు మీరా! నన్ను
శాపముక్తుని జేయ
చనుదెంచి యున్నార!

స్వాములారా! మీకు
కై మ్రొక్కగా లేను
తలలేదు మీ పదం
బుల సోకగా లేను.

అయిన మీ దర్శనం
బయ్యె దుర్గతి పోయె!
పాపఫలమది పండె
శాపమది విడిపోయె!

దనువనెడి గంధర్వు
డను, మునుపు నా అంద
మునకు నేనే మురిసి
పోయి కన్నులు గప్పి.

స్థూలశిరుడను మునివి
హేళనాందోళనల

భ్రాంతునిగ జేయ, క
బంధ రూపము దాల్చి

భయపెట్టనతడు కో
పమున 'నీకీ రూప
మే యుండు' నని శాప
మిడె, నంత నేనపుడు
ప్రాథేయ పడి వేడు కొనగ!
పలికె తా ముని కరుణ గలుగ!

"రామ లక్ష్మణులిటకు
రాగలరు నీదు బా
హాలు నరికెదరు శాప
ముడుగు నపుడే నీకు."

అని కబంధుడు ఇట్లు
తన బాధ వివరించి.
'మరియొక్క విన్నపము
మనవి చేసెద' ననియె!

"రామ లక్ష్మణులార!
రావణుని తెలిసి కొన
గలవాని నెఱిగింతు
కాని కాల్చుడు నన్ను"

నను దహించిన గాని
నాకు దివ్య జ్ఞాన
మదిరాదు గాన శ్రమ
యనక కాల్చుడు నన్ను"

అని కబంధుడు బలుక
ఇన సోదరులు వాని
గోతిలో బడద్రోసి
కొరివి కఱ్ఱలు జేర్చి
దహనమ్ము గావించి రపుడు
దనువుగా మారె రాక్షసుడు.

భగ భగమ్మని మండు
పొగలేని నిప్పువలె
ధగధగమ్మని మెరయు
నిగమ తేజము వోలె

దివ్య రూపమ్ముతో
దివి కెగసి పోవుచును
దనువు చితిలో నుండి
కనుపించి ఇట్లనును.

"శ్రీరామ వినుము నీ
చెలి దొరకు మార్గమ్ము
పంపా సరోవరము
ప్రక్కనొక ఋష్యమూ
కము గట్టు కలదు, ఆ
గట్టుపై నివసించు
సుగ్రీవుడను కపీశ్వరుడు!
సూర్యపుత్రుడు విబుధవరుడు!

అతని స్నేహము నీవు
అగ్ని సాక్షిగ జేసి
అతని సాయము తోడ
అరయు మసురుని జాడ
అని చెప్పె దనువు స్పష్టముగ
అతని స్నేహమ్మెందు కనగ

తన వలెనె కష్టముల
తగిలి యున్నట్టి వా
నిని జేరి స్నేహమ్ము
నెనరుతో సేయవలె
అట్టివాడె అవశ్య
మనుకూలుండై మెలగు
ఇది రాజనీతి రామయ్య!
ఈ మాట పాటించుమయ్య!

వాలి సుగ్రీవులను
వానరులు వారిద్ద
రన్నదమ్ములు, వాలి
అగ్రజుడు బలశాలి.

తన తోడబుట్టువని
తలచకను సుగ్రీవు
సతిని చెరబట్టి దా
ర్జన్యమ్ముతో నతని
తరిమి కొట్టగ నతడు
తలదాచుకొనె గిరిని.

సుగ్రీవుడతడు బహు
సుగుణవంతుడు కృత
జ్ఞుడు సాహసుడు మహా
త్ముడు నీకు తోడ్పడును."
అనిచెప్పెదనువు స్పష్టముగ
ఇన వంశ సోదరులు వినగ.

## కబంధుడు చూపిన దారి

"వినుడి రాఘవులార!
వినుడి నామాటలను
ఋష్యమూకము దారి
నిక మీకు చెప్పెదను.

అదిగో! పడమటి దిక్కు
ఆ దారినే పొందు!
దండిగా నిండుగా
దారి పొడుగున చెట్లు
పూలతో పండ్లతో
పూబోండ్ల వలె నుండు

మావిళ్లు వావిళ్లు
మఱ్ఱి దుమ్మికి చెట్లు
నేరళ్లు మోరళ్లు
పారిజాతపు చెట్లు

కానుగ కదంబాలు
గన్నేరు బొట్టుగులు
రక రకమ్ముల చెట్లు
రమణీయముగ నుండు.

ఆయడవి దాటగనె
అగుపించు మరి యొకటి
అందమైన వనమ్మె
నందన వనమ్మట్లు
దాని జేరిన యంత
మేని బడలిక తొలగు.

అది స్వర్గ తుల్యమై
నట్టి ఉత్తర కురు
ప్రాంతబు పగిది ప్ర
శాంతంబుగా నుండు.

పచ్చ పచ్చని చెట్లు
ముచ్చటగ తెగ పూసి
రంగు రంగుల పూల
మంగళారతు లిచ్చు.

తలనిండ పూదండ
ధరియించి నట్టి కో
మలి వోలె కాన కో
మలి కాను పించహో!
తెగపూసి పూలునగు నట్లు!
తెలుగు యెలుగులు జిమ్మునట్లు!

పాలిండ్ల బరువుతో
పడతి వంగిన యట్లు
నింగి నేలను దాక
వంగి వచ్చిన యట్లు
విరగ గాసిన పండ్ల చెట్లు!
ఒరిగి పోయెను బరువు కట్లు!

కొమ్మ కొమ్మకు పళ్లు
కొల్లలుగ గాసినవి

దుఃఖపు కొని నంతనే
బిల బిలా రాలి పడు
అమృతమ్ము వలె పళ్లు దినుడు!
ఆలసటంతయు దీర్చుకొనుడు!

## పంపకు దారి

ఆ పిదప కొంత ముం
దరుగ వినిపించు తీ
యని పాటవోలె చ
ల్లని మాటవోలె తే
నెల తేట వోలె మం
జుల మధుర మధుర క
ల్యాణ వీణా నాద
గానామృతము వోలె
జల జలా ప్రవహించు పంప!
కల కల ధ్వనులు రవళింప!
పొంగారు గంగా త
రంగ ప్రవాహినీ
సంగీత జనిత మౌ
మంగళ ధ్వనులతో

కరుణాంత రంగని
ర్ఝరిణీ తరంగ సు
స్వర మాధురీ విశ్వ
మురళీరవమ్ముతో
జల జలా ప్రవహించు పంప!
కల కల ధ్వనులు రవళింప!

తెనుగు పూవుల లోని
తేనియలు గ్రోలుచును
ఝుమ్ము ఝుమ్మను గండు
తుమ్మెదల రొదలట్లు
దివినుండి దిగివచ్చు
భువనైక మోహినీ
చరణ నూపుర ఝణం
ఝణ ఝణం కృతులట్లు—

జల జలా గల గలా
కల కల ధ్వనులతో
ప్రవహించు చున్నయది రామ!
పంపాసరోవరము గనుమ!

వేదనా రోదనల
నోదార్చు శమ గీతి
ఆలపించిన రీతి
అమృత మానిన ఖాతి
వినిపించు గళ మెత్తి
విశ్వ మంగళ గీతి—

వీనులకు విందుగా
తేనియల సోనగా
నవ మాధురీ గాన
రవళి విని పింపగా
జల జలా గల గలా
కల కల ధ్వనులతో
ప్రవహించు చున్నయది రామ!
పంపాసరోవరము గనుమ!

పంపా సరోవరము
పడమటను శబరి ఆ
శ్రమము గల దచ్చోట
శబరి సేవల నంది;

ఆ ప్రక్కనే మతం
గా శ్రమము గలదు మీ
రద్దాని దర్శించి,
ఆ మహాత్ముని తపో
మహిమలను గని నంత
మంగళము మీ కగును.

## ఋష్యమూకానికి దారి

పంప ఒడ్డున దివ్య
పర్వతము ఋష్యమూ
కము గలదు దాని శిఖ
రమున నొక గుహ కలదు.

ఆర్తుడై సుగ్రీవు
డందే వసించు న
ల్వురు ముఖ్య కపి మంత్రి
వరులతో తిరుగుచును
అతని స్నేహము గట్టు కొనుము!
అగ్ని సాక్షిగ నీవు రామ!

అగ్నిసాక్షిగ ఎందు
కనగ ద్రోహపు బుద్ధి
పుట్టునేమో! అట్టి
కట్టు దిట్టము వలయు.
అది రాజనీతి రామయ్య!
అప్రమత్తత నుండుమయ్య!

అతని స్నేహము ఎందు
కనగ నీ వలె సతిని
పోగొట్టు కొని గుండె
పొగులు చుండిన వాడు
అతని స్నేహమె చేయుమయ్య!
అది రాజనీతి రామయ్య!

అంత మాత్రమె కాదు
ఆలకించుము రామ!
ఒక కారణము వల్ల
సకల జగములు దిరిగి
నట్టి వానర వరుడు
అతడెరుంగని చోటు

అవని లోపల లేదు చూడు!
అవనిజను వెదకగల వాడు!.

అని చెప్పి దనువు సూ
ర్యుని వోలె వెలగి పో
వుచు వెళ్లు ముందు రా
ముని జూచి యిట్లనును.

సిద్ధించు సిద్ధించు
శ్రీరామ! మీ పనులు
శీఘ్రముగ సుగ్రీవు
స్నేహమును మరువకుము!

జయమగుత! జయమగుత!
జయము మీ కగు రామ!
జయ రామ! శ్రీరామ!
జయము జయ జయ రామ!

అని కబంధుడు చెప్పి
అదృశ్యమై పోయె!
చిరుదివ్వె వెలిగించ
చిమ్మ చీకటి తొలగె!

## రాముని తహ తహ

ఆ కబంధుడు చెప్ప
నట్టి దారిని బట్టి
పడమటగ పంపకై
పయనించి నారపుడు

భగవానుడా రీతి
పడమటగ పయనించ
భాస్కరుడు పడమటగ
పయనించి నాడపుడు.

దారిపొడుగున పళ్ల
తరువులను పూల చె
ట్లను కొండలను కోన
లను చూచుచును సాగి
పోగ పోగా ప్రొద్దు
పోయినది, రాత్రి వే
ళాయెపో. ఆ రాత్రి వారు
అద్రిపై నిద్రించినారు.

నిదురించి నంత నే
నిదుర పట్టునె గుండె
చిచ్చు కణకణ మండి
రెచ్చి పోవుచు నుండ.

ఖడ్గఘాతము చేత
గాండ్ర నిద్దుర గాని
యెదకోత ఒడువాడు
నిదురించగా లేడు.

అలపు సొలపును లేక
అశ్రాంతముగ నడచి
బహుదూరముల దాటు
బాట సారులు వారు.

అలసటను దీర్చు కొన
అస్తమించును సూర్యు
డల పెరుంగని వారి
కట్టి సుఖ మెక్కడిది!

విశ్రాంతి గొనకుండ
నవిశ్రాంతముగ ప్రయా
ణము చేయు చున్నారు
శ్రమ విరామము లేక
కాని చీకటి కమ్ము కొనుట!
కనరాక వారాగి రచట!

ఆ రాత్రి యెల్లెట్లొ
అద్రిపై నిద్రించి
అలసటను దీర్చుకొని
రా రామ లక్ష్మణులు.

"ఎపుడు చేరుదు పంప!
ఎపుడు చూతు మతంగ
మున్యాశ్రమము ఋష్య
మూకమును దానిపై
సుగ్రీవు నింకెపుడు
చూతునను తహతహలు
తీవ్రమైపో! నిసిని
తిట్టుకొను వాపోయి

ఈ రాత్రి తెలవారు టెపుడు?
ఏ రీతి గడుప గల నిపుడు?"

అని కాలరాత్రి కా
రణము చే తన పయన
మాగుటను వగపొగలు
రేగుటను యెదనొవ్వ
రామయ్య నిదురించడాయె!
రాత్రి శివరాత్రియై పోయె!

ధాత్రీజ చింతతో
నేత్రాలు నిండుకొని
బాష్పాల కెరటాలు
పరవళ్లు తొక్కగా–

విరహానలము సతీ
స్మరణ పవనాలచే
ఝృంభించ పరితాప
మింకింత చెలరేగ–

ఎదలోన నేమేమొ
సొదల తలపులు మూగ

భయద సర్పము మీద
పవ్వళించెడు స్వామి
నిదురవోతున్నాడు చూడు!
ఎదలోన సొదగల్గువాడు!

తనను వంచించి సీ
తను బట్టుకొని పోయి
నట్టి నీచాధముని
బట్టు కొని వదియించ
తడవయ్యె నంచు తొం
దరపాటు చెలరేగ-

ప్రజ్వలించెడు పరా
భవము దవమై పోగ
పౌరుషము పైనిండ
బడబాగ్నివలె రేగ-

పళ్లు పటపట కొరికి
కళ్ల నిప్పులు రాల
వళ్లు కంపించ చె
క్కిళ్ల దర పిడి బిగిసి,

వరనందీ సద్రమని
మెరపు మెరసిన యట్లు
ఖడ్గమును ఝళిపించ
కటిక చీకటి బెదరి
తెల్లబోయిన దకట రాత్రి!
తేరుకొన్నది భూత ధాత్రి!

పరితపించెడు రామ
భద్రుగని రాత్రి రమ
జాలిగొని చల్లగా
జారుకొని పోసాగె

లోకైక రక్షకుని
శోకమును గనలేక
పక్ష హస్తాలతో
పట పటమ్మని రొమ్ము
లను బాదుకొని బిగ్గ
రగ కోడిపుంజులవి
ఆక్రందనము సేయ దొడగె!
అవి యెంత జ్ఞానులై మెలగె!

తన వంశజుని కష్ట
మునకు నెరి మండిపడి
తమిని దండించగా
తమ్మిచెలి నభ మెగనె!

ఆ రాత్రి యెట్లో
అద్రిపై గడిపి ఆ
రామ లక్ష్మణులు తొలి
జాములో సిద్ధమై
పంపకై పయనించినారు!
బ్రాహ్మీముహూర్తానవారు.



——నా భద్రగిరి శతకము నుండి

జనకాజ్ఞన్ దలదాల్చి నందులకు రాజ్యభ్రంశమున్ గల్గె సీ
తను దుర్మార్గుఁడు దొంగిలించె, బ్రతుకంతన్ గానపాలయ్యె నే
పనెదన్ మంచికిఁబోవ చెడ్డ యెదురై నట్లాయె సన్మార్గ వ
ర్తన కేలా కడగండ్లు? భద్రగిరి సీతారామచంద్ర ప్రభూ!

అరెరేఁ! చెప్పులు గోర తమ్మునికి నాప్యాయంబుగానిచ్చి యె
క్కరణిన్ రిక్తపదంబులన్ నడచితో కారాటవిన్ కంట కో
త్కరమెట్లోర్చితొ? పాదరక్షలయి నీ కాళ్ళంటలేనైతి న
త్తరుణంబందున దేవ! భద్రగిరి సీతారామచంద్ర ప్రభూ!

ఎడబాటే బడబాగ్నిగాగ బ్రతుకంగేరీతి సాధ్యంబు నీ
యెడదన్ సీతయు నీవు సీతయెదలో నెవ్వేళఁ ధ్యానింపఁగా
బడుటంగాక! స్మరింతు మీయుభయులన్ భావంబులో నెప్పుడున్
దడవేలా నను బ్రోవ భద్రగిరి సీతారామచంద్ర ప్రభూ!

# సీతాన్వేషణ

## పంపా సరోవరము

అదె వచ్చె అదె వచ్చె
అదె వచ్చె వచ్చె పం
పా సరస్సది రమా
హాస విన్యాసమటు
కనుచూపు మేరలో వచ్చె!
కల్యాణములను గొనితెచ్చె

అదె వచ్చె అదె వచ్చె
అదె వచ్చె పంప!
అదె వచ్చె చూడు మన
యెదల పులకింప!!

సత్కవీంద్రుని కావ్య
సరస భావ రసైక
పద్ధతిని శుద్ధమై
ప్రవహించుచును వచ్చె!

కమలోత్పలాలచే
రమణీయమై యలరు!
విమలోదకాలచే
కమనీయమై తనరు!

పాల వెన్నెలవోలె
లీలగా ప్రవహించు
స్నిగ్ధ వైఢూర్యమలు
శుద్ధమై భాసించు.

అది తెనుగు తల్లి ప
య్యెదవోలె లాసించు
అది తెనుగు నుడికార
మట్లు ముద మొదవించు.

అది ప్రశాంత నిశాంత
మై యలరు ప్రాంతమ్ము!
అన్యోన్యతను గూర్చ
అనురాగ నిలయమ్ము!

పరమ రమణీయమై
వరసుఖా రామమై

పదమూని నంత నే
ఎద వెలుగు లెగ జిమ్మ
అదె తెలుగు దేశమ్ము చూడు!
అదె హంపి ప్రాంతమ్ము నేడు!

భవ బంధముల బాపు
పరమసుఖ ధామ మది
పంపా సరోవర
ప్రాంతమది–అచ్చోట.

జాతివై రములేని
నీతి పాటించి నటు
పులి ఆవు లొకచోట
జలము గ్రోలుచు నుండు.

భాగ్యవంతుడు పేద
బాగు గోరిన పగిది
సెలయేళ్లు నీళ్ల శ్యా
మల మొనర్చుచు నుండు.

దీనాళిపై జాలి
వాన గురిసిన మాడ్కి

మేఘు డానందాన
మేదిని గురియుచుండు.

పతితకై త్యాగత
త్పరత జెందిన యట్లు
నీరు పల్లపు నేల
పారు చున్నది చూడు.

అదె చూడు మదెచూడు
అదె చూడు చూడు
పంపా సరోవర
ప్రాంత మదె చూడు!
అదె తెలుగు దేశమ్ము చూడు!
అదె హంపి ప్రాంతమ్ము నేడు

పరమ సుందరమైన
పద్మాలతో నిండి
పంపా సరోవరము
బరగు చున్నది చూడు!

ఆ సరస్సున క్రౌంచ
హంసాది పక్షితతి

అదురు బెదురును లేక
హాయిగా దిరుగుచును
నరులు దగ్గర జేరి
నను వెరగు జెందకను
వధ యేమిటో తెలియ కుండు!
వ్యధలన్ని నరులకే యుండు!

అదె చూడు మదె చూడు!
అదె చూడు చూడు!
పంపా సరోవర
ప్రాంత మది చూడు!

## మతంగాశ్రమమం

అదెచూడు మదెచూడు
మదె పంప చూడు!
అచ్చోటనే మతం
గా శ్రమము చూడు!!

కౌపీన ధారులై
కనుపింతురే కాని
కాంచనాంబరములను
గప్పుకొనరేనాడు

ఆకలికి కందమూ
లాదులను భుజియింత్రు
కాని మృష్టాన్నాలు
కాంక్షించరే నాడు.

రోషాన భీష్మించి
కాషాయ నేత్రులై
మేమె తాపసులమని
మిడిసిపడి జనములను
పెడదారి బట్టించి
ఇడుములను సృష్టించి
మత్సరము తోడతుల
మతకీలలమ రేపు
వారు కానేకారు.
వారు శాంతి ప్రియులు.

శాంతి సౌభాగ్యాల
సతతమ్ము కాంక్షించి
మంచినే ప్రేమించి
మానవత నెగిడించి

సర్వజనహితమెంచి
నిర్విరామంబుగా
బపతపాదులొనర్చు
సన్మునీంద్రులు వారు
వారు నిజమైన తాపసులు!
వసుధ ప్రత్యక్ష దైవములు!

అదె చూడు మదె చూడు
మదెపంప చూడు!
అచ్చోటనే మతం
గాశ్రమము చూడు!

కనుల పండువు గాగ
వనమెల్ల చూడ ము
చ్చట గొల్పు చున్న ద
చ్చటి మహిమలను చూడు!

పూజార్థమై మునులు
పూలుగొని తేబోగ
శ్రమజెంది తమ శరీ
రములు చెమటలు చింది

నేల రాలగ చెట్లు
పూలతో పండ్లతో
నిండుగా పచ్చగా
నేటికిని వాడకను
నెగడు చుండును మునుల మహిమ!
పొగడ శేషునకైన వశమ!

జపతపాదుల చేత
ఉపవాసములు చేసి
బక్క చిక్కిన నేమి?
బలహీనులా వారు?

వారి ఆత్మ బలమ్ము
వర్ణించగా నౌనె!
పానార్థమై సప్త
సాగరాలను సమీ
పమునకే రప్పించినారు!
బలహీనులగుదురా వారు!

దర్భనే అస్త్రముగ
ధరియింతురా మునులు

మిణుగురుల దావాగ్ని
కణకణమ్మని రగులు
దుర్భలు లటంచు దుం
దుడుకు పడనేల!
ఉదకంబులో విద్యు
దుత్పాత కీల! ॥అదె॥

"లక్ష్మణా! ఇక మంగ
ళము సమీపించినది
నా డెందమునకు నా
నందమగు చున్నయది.

శుభము వచ్చెడువేళ
సూచనగ అదిముందు
మనసునకు దోచు చుం
దును గాన మనమింత

పంపా సరోవరము
పరుగు పరుగున జేరి
సుగ్రీవు నచ్చోట
చూచెదము శీఘ్రముగ.

ఆతని వల్లనె కదా
అవని సుత వెదకించు
టను కార్య మంతయును
మనకు కావలసినది.

ఆతని స్నేహము మనకు
అవశ్యకము గదా!
నదిదాట శక్యమగు
నావతోనే కదా!

అని పలుకుచును రాము
డనుజుతో వడి వడిగ
నడువ, తానే పంప
నడచి ఎదురుగ వచ్చె!

అదె వచ్చె! అదె వచ్చె!
అదె వచ్చె పంప!
అదె వచ్చె ప్రేమోద్రైన
మెదల విగురింప!

## శబరి ఆశ్రమము

పంప పడమటి ఒడ్డు
ప్రక్కనే గల దొకటి
ఆశ్రమము అది శబరి
ఆశ్రమమ్మని బరగు.

అది పరమ రమణీయ
మైనట్టి యాశ్రమము
దావి దర్శించు నెడ
ధన్యమగు జీవనము.

అని తలచి రామల
క్ష్మణులు జేరిరి శబరి
ఆశ్రమము నంతలో
ఆ శబరి ఆత్రమున

లేచివచ్చి సమస్క
రించినది. ఆ రామ
లక్ష్మణుల పాదకమ
లాలపై వ్రాలినది.

అతిధి మర్యాదతో
ఆప్యాయ మొలకగా
అర్ఘ్య పాద్యము లొసగి
ఆతిథ్య మిచ్చినది.

బాష్పజలముల తోడ
పాదములు గడిగినది.
భక్తిరస పూర్ణ హృ
త్ఫలములందించినది.

మధుర మధుర ఫలాలు
మమతతో తినిపించె.
తీయ తీయని పుట్ట
తేనియలు ద్రావించె.

తనివి తీరగ పరం
ధామ రామాకృతిని
కనుల పండువు గాగ
కాంచి తరియించినది.

"నా జన్మ సఫలమై
నదిరామ! నినుజూచి

నా పాపములు క్షాళ
నములయ్యె శ్రీరామ!

నీ కృపా దృష్టిచే
నే ధన్యనైతి. నే
నిక పుణ్య లోకాల
కేగెదను రఘురామ!"

అని శబరి భక్తితో
ప్రణమిల్లి పలికి నం
తనె రాము డిట్లనియె
వినయ ముట్టి పడంగ.

"శబరిమాతా! నీవు
సామాన్య వనితవా!
సిద్ధురాలవు వయో
వృద్ధురాలవు నియమ
బద్ధురాలవు పరమ
భక్తురాలవు నీవు.
ఓ మంగళాకృతీ!
ఓ పరంజ్యోతీ!

నిను జూడగనె శుభము గలుగు!
ఇను జూడగనె నిశలు దొలగు!

మన్యకుల వనితవై
గణ్యురాలవు నీవు
గుణములో నీకన్న
గొప్పవారెవ్వారు?
నీ చేతి ఆతిథ్య
మే చేతనా జ్యోతి
యై మాకు చేకట్లు దూరు!
అదె వెలుగు బాటగా మారు!

అడవిలో బడినాము
ఆత్మీయతకు దూర
మైనాము మమ్మింత
ఆదరముతో చూచు
వారెవ్వరున్నారు తల్లీ!
కారుణ్యరసకల్పవల్లీ!"

రాముడీ రీతిగా
సామాన్య మానవుని
వలె పలికి శబరి దీ
వనల గోరిన యంత

"మంగళము మంగళము
మంగళము శ్రీరామ!
మంగళమ్మగు మీకు
మహిత మంగళ ధామ!"

అని శబరి పరికి రా
మయ్యతో నెలవంది
ప్రాత వస్త్రము వదలి
నూత్న వస్త్రము దాల్చు
నట్లు తన జీర్ణ దే
హము నగ్ని కర్పించి
జాజ్వల్య మానమగు
జాత వేదిని బోలు
దివ్య దేహము నొంది
దివిజపురి కేగినది

ఎంత ధన్యము శబరి చరిత!
ఎంత పుణ్యము భక్తి కవిత!

"శబరి సందర్శనము
జయ సూచకంబయ్యె.
సౌమిత్రి ఇక మనకు
జయము నిశ్చయమగును.

నా మనసు సంతోష
నది యనుచు పొంగారె!
నీ ముఖము కళలతో
సోమువలె రంగారె!

ఇది శుభము సూచించు
ఇక మనము ఋష్యమూ
కము రగలమందె
కలడు కద రవి సుతుడు!

అతని స్నేహమె మనకు
ఆవశ్యకము గదా!
నదిదాట వీలగును
నావతోనే కదా!"

## పంప ఒడ్డుపై నడక

అని పంప పశమటొ
డ్డును బట్టి ఋష్యమూ
కాద్రి జేరగ రామ
భద్రు డాత్రము తోడ
మును ముందు తానడువ జొచ్చె!
వెను వెంట సౌమిత్రి వచ్చె!

పంప ఒడ్డును బట్టి
పయనించుచును రాము
డలవోకగా నదీ
జలము నాలోకించు
నపుడు చిత్రము గానుపించె!
అవనిసుత మదిని తలపించె!

తమ వంటి కనులుగల
తరుణి సీత తలంపు
నకు వచ్చి రామ మూ
ర్తికి బాధ కలుగునని
కనపడక నీటిలో
నణిగినవి మీనములు.

కాని చక్కని మనసు
గల రామునకు సత్య
మును దాచుటపచార
మని యెంచియో! లేక
నిజ సతీ స్మరణమొక
నిముస మాత్రము వీడి
జీవింప లేడు సీ
తా విభుండని యేమొ!

స్వచ్ఛమైనట్టి కా
సారమది అడుగులో
పల నణగియున్న చే
పలు నీటిలో నుండి
అద్దమ్ములో వలెను
అగుపింప జేసినది.

అకటకట! విధి యెంత
వక్రుడో చూడు!
క్షణమైన విరహాగ్ని
చల్లార నీడు!

తళ తళా చంద మా
మలు చలాంగులు గొట్టి
పంపా వధూటి చెం
పలు తళుక్కున మెరయ!
మహితనయ చెవుల క
మ్మల ధాళ ధళ్యములు
చెక్కిళ్లపయి వింత
చెలగి నట్లని పించ
చెలి తలపునకు వచ్చి
చెమ్మగిలె కనులు!
చిట్టి చేపల కేల
చెనకించు పనులు!

జానెడేసిన గండు
మీనాలు మిలమిలా
పంపా వధూశ్రుతుల
ప్రక్కగుస గుసలాడ
వైదేహీ ముఖసరో
వరములో చేపలను
విడివి కన్నులు చెవుల
నుడివి నట్లని పించ

చెలి తలపునకు వచ్చి
చెమ్మగిలె కనులు!
చిట్టి చేపల కేల
చెనకించు పనులు!

పంపా సరస్సులో
పద్మదళముల జూచి
పద్మ నేత్రను దలచి
బాధతో రఘువరుడు
కనురెప్ప లప్పళిం
చెను బాష్పబిందువులు
చెక్కిళ్ళపై రాలి
చిట్లి చెదురుచు పోగ

కాలమనియెడి కష్టో
లాలపై కన్నీరు
నిలువ దెన్నటి కనెడి
నిజము చాటగనేమొ!
కష్టాల కేనాడు
కాళ్ళు లేవండ్రు!
కాలమే కష్టాల
కథ తేర్చు నండ్రు!

## హంస మిథునం

ఈ రీతి లోలోన
ఏడ్చుచును కన్నీళ్లు
గ్రుక్కుకొను వానిగని
గుండె చెరువై పోయి

హంస మిథునమ్మొకటి
అంగ లార్చుచు నిట్లు
సంభాషణమ్ముగా వించె!
జాలి గుండియలు ద్రవియించె!

అటుచూడు మటుచూడు
మటు చూడుమో ప్రియా!
ఆ అంద గాడెవడో?
అటు చూడుమో ప్రియా!

ముఖమెల్ల అశ్రువులు
ముసురుకొన యేమేమొ
తలచు కొనుచుసు పర
ధ్యానమున నున్నాడు.

ఆ నాడు గగనాన
ఆక్రందనము చేయు
చుండగా అబలనొక
దుండగుడు గొనిపోగ

అప్పుడా అబల దీ
నాతి దీనముగా వి
మానమ్ములో నుండి
మహివైపు చూచుతరి,

జలములో ఆమె ముఖ
చంద్రబింబము ఛాయ
కనిపించినదిక దే
కన్నీళ్లతో నిండి!
ఆమె అందానికీ
అందగాడే జోడు
ఈడులో జోడులో
ఈతడే తగు వాడు.

ఆమె ముఖమంతయును
అశ్రుజల పూరితము

ఇతని ముఖమట్లె పూ
రిత మశ్రువుల తోడ.

ఇక సందియము లేదు
ఇతడె ఆ సుందరికి
విభుడుకాడే! చూడు
విలపించు చున్నాడె!

అవును సఖా! అవును సఖా
నీ వన్నది నిజము సఖా!
ఆ సుందరి కీ సుందరు
డే సరియగు మగడు సఖా!

వొట్టి మాటలన్ని నీవు
కట్టిపెట్టుమో ప్రియతమ!
గట్టిమేలు తలపెట్టుమ!
గట్టు చేర్చు మాట లనుమ!

ఇతని దుఃఖ సందేశము
ఏ తరిగొని పోయి ఆమె
కేలాగున వినిపింతము
ఆలోచించుమ ప్రియతమ!"

అని ఇట్లు వాపోవు
చును హంస మిధునమ్ము
తమ ప్రభువు కఠిన హృద
యము నింత కరగించ

బిర బిరా ఆ సరో
వరములో నీదుచును
కమలాల కడగేగి
కమలాసనుని చూచి.

"మృదువులైన కమలంబుల
మీఁద గూరుచుండు ప్రభూ!
తమ కింతటి కాఠిన్యము
తగదు సరస్వతీ విభూ!"

అవి జాలిగుండె గల
హంస మిధునమ్మిట్లు
విధిచేత విడివడిన
మిథున శోకము జూచి
ఆర్తితో అభియోగ
మర్పించె- విధి అంత-

"విధినెంత వారికిని
అధిగ మించగ రాదు
నాకైన ననుగన్న
శ్రీకాంతునకునైన.

లోకాలకీ సత్వ
రూపమెరిగించుటకు
మాధవుడె తానిట్లు
మానవాకృతి దాల్చె!

విధి నెరుంగక మీరు
విలపించ వలదు!
కాలమే కష్టాల
కడతేర్చ గలదు!"

అవి సమాధానమ్ము
వినిపించ ఆ హంస
మిధునమునకు రపంత
వ్యధ శమించిన దంత!

ఇది కట్టు కథకాదు
ఇది రసప్రియు కలము

కదలి కదలించగా
ఎదలు నదులై పారు
వేలేండ్ల రామ కథ వినుము
విధి చేతి కీలుబొమ్మలము.

## వసంతర్తువు

పంప ఒడ్డును బట్టి రాముడు
పయనమై చనుచుండగా
లక్ష్మణుడు వెనువెంట వీడక
రక్షణగ చను దెంచగా.

పంపలో పద్మాలు ఘుమఘుమ
పరిమళాల్ విరజిమ్మగా
పద్మ దళములపైని హిమకణ
పంక్తి పక పక నవ్వగా.

అదె వసంతము వచ్చినది తు
మ్మెదలు ఝుమ్మని పాడగా
వలపు విరిసిన తోటలో యా
వన మయూరము లాడగా ॥అదె॥

రంగు రంగుల పూల తరువులు
రమణులై విలసిల్లగా
కొమ్మ కొమ్మన కోయిలమ్మలు
కమ్మ కమ్మగ పాడగా— ॥అదె॥

కోడె గాడుపు సోకినంతనె
గుబురు కొమ్మలు కదలగా
కామినీ ఘన జఘన మల్లన
కదలి నట్లని పించగా— ॥అదె॥

జలజలా మేఘములూ చక్కగ
జలము కురిసిన రీతిగా
భూమిపై భూజములు పొలుపుగ
పుష్పములు వర్షింపగా—

గాలి వీచెను పూలకొమ్మలు
కదలె తుమ్మెద తిమ్మగా
గానమును గావించె ఝుమ్మని
గాలి గూరిచి కమ్మగా—

నీల పీతమ్మయిన పచ్చిక
నేల పువ్వులు రాలగా

రత్న కంబళి గప్పినట్లది
రమ్యముగ భాసిల్లగా—

పసుపుకోకలు పసిడి తొడుగులు
పై ధరించిన వారిలా
కొండ గోగులు వనము నిండుగ
కొల్లలుగ పుష్పించగా—

కోడెగాడుపు కల్లనల్లన
కొన్నిపువ్వులు రాలగా
కొన్ని కొమ్మల యందె యుండగ
కొన్నిరాలుచు నుండగా—

కామ మదమున స్త్రీలు మగలను
కౌగిలించిన రీతిగా
గాలి ధాకకు లతలు ప్రమానులు
కౌగిలించెను ప్రీతిగా—

ఆదె వసంతము వచ్చినది తు
మ్మెదలు ఝుమ్మని పాడగా
వలపు విరిసిన తోటలో యా
వన మయూరము లాడగా—

ఇది రమణీయము ఇది రసవంతము
ఇది సుకుమార విలాస వికాసము
దీనిని దానిని దేనిని వదలక
తేనెలకయి పూబోటుల పయి
వాలి పోయినవి తుమ్మెదలు!
సోలి పోయినవి పుష్పములు!

పూదేనెలకయి భృంగరాజములు
పొలుపుగ పంపా తీర వృక్షముల
తడవ తడవకొక వృక్షముపై మ
త్తములయి నెగయుచు పూబోటులపయి
వాలి పోయినవి తుమ్మెదలు!
సోలిపోయినవి పుష్పములు!

వివిధ పుష్పములతో నిండినవై
వృక్ష శిఖరములు గాలికి కదులుచు
హెచ్చుగ బూచితి నేను నేననుచు
మచ్చిక బిలిచెను తుమ్మెద ప్రియులను.

వసంతు ర్తువది వచ్చినది
వయసుకు వలపులు తెచ్చినది.

గాలికి కొమ్మలు కదలుచుండగా
కామిని జనములు ప్రియులెటుపోయిన
పీడక అనువర్తించిన చందము
వృక్షములను లతలనుకరించినవి.

వసంతర్తువది వచ్చినది
వయసుకు వలపులు తెచ్చినది.

అతి వేగంబున నంతట వీచెడు
అనిలునిచే తరుశాఖాగ్రములొక
దాని కింకొకటి కలసి మాలగా
కానుపించెనది యెంత మనోజ్ఞము

వసంతర్తువది వచ్చినది
వలపు పిలుపు విన వచ్చినది.

కొన్ని వృక్షములు పూదేనెలతో
కోమలులట్లుగ గుబాళించగా
కొన్ని వృక్షములు మొగ్గలతోనే
కన్నెల వలె ఒయ్యార మొలకగా

వసంతర్తువది వచ్చినది
వయసు పింఛముల విచ్చినది.

గండు కోయిల ధ్వనితో వాయువు
కొండ గుహలలోనుండి వెడలి వృ
క్షములను నటులకు వెనుక నుండి గా
నము చేసెడి వాడట్లు దోచగా

వసంతర్తువది వచ్చినది
వలపు పింఛముల విచ్చినది.

పురుషుడె భామిని వెంబడించనుటు
సరికాదది ఒక ఆడ నెమలియే
మదాతి రేకముతో తానే ప్రియు
మరి మరి రమించు చున్నది చూడుము.

వసంతర్తువది వచ్చినది.
వయసు పింఛముల విచ్చినది.

పర్వత సానువులందు మయూరము
పరవశమున నర్తించుట గని ఒక
ఆడ నెమలికా సురతార్థినియై
ఆడుచు తనప్రియు నాహ్వానించును.

వసంతర్తువది వచ్చినది
వలపు చిలిపిగా నవ్వినది.

విచ్చిన రెక్కలతో పరుగెత్తుచు
రెచ్చిన మదమున రమించ బిర్రున
ఆశ నెమ్మిలిని తెగ వెంటాడెడు
కోడె నెమలి బలు వాడిని చూడుము.

వసంత ఋతువది వచ్చినది
వలపు చిలిపిగా పిలిచినది.

కొంత కొండపై కొమ్మకొమ్మపై
కోడెగాడు పది కొంటె కొంటెగా
తడవ తడవ కొక వనమును మార్చుచు
తనివి తీరగా సంచరించుచును

రసముల నాస్వాదించినది
రమ్యముగా విహరించినది.

గాలి తెమ్మెరలు వీచినవి
పూలవానలే కురిసినవి
కలకలలాడే మధు వసంతమున
వలపుల పిలుపులు గింగురు మన్నవి.

పూలు ధరించిన నీలి కురుల శిర
ముల నాడించుచు పాడు గాయకుల
వలె విరబూచిన కొమ్మలు గాలికి
చలించ తుమ్మెద లిమ్ముగ పాడగ ॥వ॥

కొమ్మలు పూచెను పూలు పూలలో
తుమ్మెదలుండెను మధువు మత్తులో
తెమ్మెర వీచెను కొమ్మలు కదలెను
తుమ్మెద లిమ్ముగ ఝుమ్మని పాడెను ॥వ॥

వనవృక్షములవి మధుగంధముతో
వాయువుచే కదలింపబడినవయి
తేనెటీగల ధ్వనులచే మధుర
గానము చేసెడు పగిది దోచగా ॥వ॥

కామ మదముచే కంపించిన తన
కాంతను వెనుకొని పోవునట్లుగా
గాలికి కదలెడి తిలక పుష్పమును
క్రమ్మర తుమ్మెద వెనుకొని తిరుగును ॥వ॥

మద్యమదముచే చలించు సఖివలె
మారుత కంపిత తిలక మంజరిని

చెలరేగిన మదనాతి రేకమున
శీఘ్రమె మధుపము పొందుచున్నది ॥వ॥

మలయ మారుతము వీచుచు చెమటల
తొలగించి రతిశ్రమముల హరించి
హాయినిగూర్చే వసంత ర్తువది
అకటా! విరహుల దపింప జేసెను.

జంటలేని దొక ప్రాణిలేదచట
ఒంటరి కంటికి మంటరేగునట
వియోగ మెరుగని మయూర మిధునము
విరహ తప్తులకు హృదయ మర్ధనము-

వసంతర్తువే అగ్నిహోత్రమై
అశోక వృక్షమె మందు కొలిమియై
చిగుళ్లె ఎర్రని జ్వాలలు కాగా
చిరు తెమ్మెర పెను చిచ్చై పోగా

సీతలేని శ్రీరాముని మదిలో
చిట చిట మంటలు రేగినవి
కట కట! కన్నులనుండి ధారగా
బొట బొట అశ్రువులొలికినవి.

## రాముని కలవరము

పద్మములలో సీత మోమును
పద్మదళముల సీత కన్నులు
మీనములలో సీత చూపులు
సూనములలో సీతనవ్వులు.

కీర రవళుల సీతపలుకులు
క్షీర గ్రాహుల సీత నడకలు
కోయిలమ్మల కుహూకుహూలలో
తీయ తీయని సీతపిలుపులు

మావి చిగురున సీత దేహము
మావి పిందెల సీత చిబుకము
ఆ వసంతము నంతటను సీ
తా కృతిని గని కలవరించుచు

ధీరతను గోల్పోయి రాముడు
దీనుడై విలపించ సాగెను
చేతనాచేతనములన్నియు
చెలిమెలట్లు ద్రవించి పోయెను.

అపుడు రాముడనాథుడుగ ని
ట్లనె సుమిత్రా నందనునితో
కనుల కెరటాలలము కొనగా
కంఠమున గద్గదిక మదరగ—

"తమ్ముడా! ఇక సీత దొరకదు
తరలి పొమ్మిక నీవయోధ్యకు
సీత లేనిదె నేను బ్రతుకను
చిచ్చు నాలోనే జనించెను.

నేను బ్రతుకను నేను బ్రతుకను
జానకిని విడి నేను బ్రతుకను
తమ్ముడా! ఇక నీ వయోధ్యకు
తరలి పొమ్మిక సీత దొరకదు."

తమ్ముడా! చూడు నా
దౌర్భాగ్య మిట్లుండె!
కన్న తండ్రే నన్ను
కానలకు పంపించె!

అధికారమా! లేదు!
అర్థబలమా! సున్న!

బ్రతుకంత కారడవి
పాలయ్యే ఘోరన్న!

దీనుండనై రాజ్య
హీనుండనై యున్న
నన్నంటి నీడగా
నా వెంట వచ్చినది.

తనలోని కష్టాలు
దాచు కొన్నది నవ్వు
మొగముతో నన్నెపుడు
మోదాబ్ధి దేల్చినది.

చెలియ పెదవుల మీద
చిరు నగవు తొణకాడు
పెదవి విప్పిన చాలు
కదలాడు హాస్యాలు

పలుకు పలుకున తేనె
లొలుకు నట్లని పించ
ప్రతి మాట హితముగా
ప్రతి మాట బుద్ధిగా

చెప్పునది మీ వదిన
ఇప్పుడే మయ్యెనో?

వనములో జీవనము
తనకు బాధగ నున్న
తన బాధ మనసులో
దాచు కొన్నది గదా!

ఆ పతివ్రత నసురు
డపహరించుక పోగ
తన వెంట నేనేగనైతి!
తనను నే రక్షించనైతి!

నా ప్రాణ సమమైన
ఆ పుణ్యవతి సీత
నెడబాసి లక్ష్మణా!
ఎట్లు జీవింతురా!

ఏ మొగము పెట్టుకొని
ఏ నయోధ్యకు వత్తు?
ఏమి చెప్పుదు సీత
ఏమాయెనని ఎవ్వ

రేని నన్నడుగుచో
ఏ మందు వారలకు?
మన తల్లులకు, మామ
జనకునకు, భరతునకు,
ముని వశిష్టాదులకు
మన మహా జనములకు
ఇక అయోధ్యకు నేను రాను
మొక మేరికిని జూపలేను.

నా ప్రాణమైన జా
నకిని నే నెడబాసి
జీవించగా లేను
నీ వయోధ్యకు పొమ్ము!
నే రాను నే రాను లక్ష్మణా!
నీ వయోధ్యకు వెళ్లనాయనా!

వ్యర్థుడను వట్టి ఆస
మర్దుడను దురదృష్ట
వంతుడను కష్టాబ్ధి
బడి కొట్టుకొను వాడ.

నన్నంటి పెట్టుకొని
కన్నీళ్లు పంచుకొని
కట కటా! నీవెన్ని
కష్టాలు పడితివిర!
చినవాడ నినుజూడ
చెమ్మగిలు కనులు!
నీభ్రాతృప్రేమ కివె
నీరాజనములు!

లక్ష్మణా! నా బహి
ప్రాణమా! నా కొరకు
నీ నిండు యౌవనము
నిత్య భోగము సకల
మును త్యాగ మొనరించినావు!
నను వీడకున్నావు నీవు!

భ్రాతృ ప్రేమకు నీవు
భార్య నెడ బాసితివి
పరమ యోగీ! త్యాగ
పాదోధి! నా కొరకు.

పడరాని కష్టాలు
పడుచు ఈ అడవిలో
కడగండ్లలో నన్ను
విడనాడ కున్నావు.

కనురెప్పవలె నన్ను
కాపాడు చున్నావు
చిన వాడ నిను జూడ
చెమ్మగిలు కనులు!
నీ భ్రాతృ ప్రేమకివె
నీరాజనములు!

నన్నంటి నీడగా
నా వెంట వచ్చితివి
పవలనక రేయనక
పలుకష్టముల బడితి

నా కొరకు నీవెంత
నలిగితివి చిక్కితివి
నినుజూడ నాగుండె తరుగు!
చిన వాడ భరతు కడ కరుగు!

నా నిమిత్తము నీవు
నగర వాసము వదలి
కారడవి కరుదెంచి
కష్టాల పాలగుచు
నన్ను సేవించుచును
నలుగుచును నీ వెంత
చిక్కి పోతివిర చినవాడ!
చెరువౌను గుండె నిను జూడ!

సీత లేకుండనే
జీవించగా లేను
నేరాను నేరాను
నే నయోధ్యకు రాను.

అడవిలోనే అంత
మైపోదు నీ వింక
ఈ నికృష్టుని వెంట
నే వీడి పో పొమ్మ!
ఎన్నాళ్లు నీ విట్లు
కన్నీటి మున్నీట
మునిగెదవు తమ్ముడా! చూడు!
కొనితెచ్చు కొనరాదు కీడు!

దౌర్భాగ్యుడను నేను
తగదు నాతో నుంట
ప్రేమతో చెప్పితిని
పిచ్చితండ్రీ! పొమ్ము!

నన్నుంటి పెట్టుకొన
కన్నీళ్ల బ్రతుకగును
భరతుతో గూడి సౌఖ్యములు
బడయు నీకేల కష్టములు

## లక్ష్మణుని ఓదార్పు

అని ఇట్లు దుఃఖించు
చును రాము డార్ద్రుడై
ముఖమెల్ల కన్నీళ్లు
ముసురు కొన కనులలో

కన్నీటి కెరటాలు
కదలాడ గద్గద
స్వరముతో బలుకగా
సౌమిత్రి తనువెల్ల
గగురుతో గగ్గతిలి పోయె!
మొగమెల్ల తెల్లబడి పోయె!

ఎడద భ్రాతృప్రేమ
జడధియై పొంగార
కనుల జలజల బాష్ప
కణజాలములు రాల

లక్ష్మణుడు అనురాగ
రసరాశి అన్నతో
ధైర్యమును చెప్పుచును
తానిట్లు వచియించెం

"అన్నయా! నీ విట్లు
ఖిన్నుడవు కారాదు!
దైన్యమున నీవిట్లు
ధైర్యమును విడరాదు!

వీరుడవు శూరుడవు
ధీరుడవు నీవనా
ధునిగ దుఃఖించ నీ
కనుచితము రఘువీర!

నేనుంటి నీ వెంట
నీకేల దుఃఖమిక

ఆ దురాత్ముడు రావ
ణాసురుడు పాతాళ
మేగినను మరియింక
నెందేగినను అదితి
గర్భమున దూరినను
కడకక్కడికె వెళ్లి
వాని ప్రాణము తీతు!
వదినమ్మగారిని తెత్తు.
నేనుంటి నీ వెంట
నీకేల దుఃఖమిక
ధైర్యముగ నుండు రామన్నా!
దైన్యమది పనికి రాదన్నా!

దైన్యమున నిర్వీర్యు
డై నరుడు చెడునన్న!
దైన్యమే నాటికిని
తగదన్న రామన్న!
దైన్యమును విడనాడుమన్నా!
ధైర్యమును చేపట్టు మన్నా!

స్నేహమధికంబైన
మోహమధికంబగును
మోహాతిశయమున స
మూల నాశన మగును

అతియైన స్నేహమది
హాని గూర్చును, వత్తి
పొడుగుడిగి తగులబడి
పోదె అతి తైలమున!
అతియెన్నటికి కూడదన్నా!
అతి ప్రేమ నణచు కొనుమన్నా!

మోహమును వీడి ఉ
త్సాహమున లెమ్మ!
ఉత్సాహమే నరున
కురుతర జయమ్మ!

దైన్యమును విడనాడి
ధైర్యమున లెమ్మ!
ధైర్యమే కార్యసా
ధనకు మూలమ్మ!

నీ వెరుంగని ధర్మ
మే లేదు రఘురామ!
నీ వెరుంగని మర్మ
మే లేదు గుణధామ!

సకల శాస్త్రజ్ఞుడవు
సర్వజ్ఞుడవు నీవు
నిన్ను నీవే మరచి
యున్నావు నీవు!
నివురు గప్పిన యట్టి
నిప్పువై నావు!"

అని ఇట్లు లక్ష్మణుం
డన్ననోదార్చుచును
ధైర్యమును చెప్పుచును
తగ బలికినంత రా
ముడు కొంత కుదుట పడినాడు
ముందునకు పోసాగినాడు!

మోహమును దుఃఖమును
పోనాడి, దైన్యమును

తెగనాడి, ధైర్యమును
తెచ్చుకొని, ముందునకు
నడువ సాగెను పంప
నది ఒడ్డు బట్టుకొని—
గుండె దిటవును జేసి
కొని మౌన ముద్రలో
అంజలిడు రామయ్య
కండగా లక్ష్మణుడు

అప్రమత్తత తోడ
అన్నవెంటను మదపు
టేనుగువలె నడచుచును
ఏ మరికలేకుండ
అన్నగారిని వెయ్యి
కన్నులను గాంచుచును
నీడ కుండగ వెంట నడచు!
నీడనే పరిహాస పరుచు!

కడగండ్ల లోననే
విడనాడ కుండగను
ఆదుకొను వాడె సోదరుడు!
కాదనెడి వాడు ఘాతకుడు!

# సీతాన్వేషణ

## సుగ్రీవుని భయము

"ఎవరీ ఆజాను బాహు
లెవరీ భద్రాకారులు
ఉత్తమ శరములు దాలిచి
మత్తేభములటు నడుచుచు
నిట వెదకుచు న్నారలు
ఎవరి కొరకు ఎవరికొరకు?

ఈ పంపానది ఒడ్డున
ఈ మతంగముని యునికిని
పొదల పొదల గుహల గుహల
వెదకుచు న్నారు వీరు
ఎవరి కొరకు ఎవరి కొరకు?
ఇట వెదకుచు న్నారలు?

ఇంతగ వెదకుచు న్నా
రెవరి కొరకు ఎవరి కొరకు?
నా కొరకే నా కొరకే
నా కొరకే కాబోలును!

నన్ను బట్టి వధియించగ
నా ప్రాణములను తీయగ
వాలి పంపునను వచ్చిన
వైరులు వీరే వీరే!"

అని భీతిలి సుగ్రీవుడు
అనుమానము పెనుభూతము
కాగా ఋష్యాద్రి నుండి
కాంచెను రఘుసోదరులను.

గిరి మీద నుండి సు
గ్రీవుడా రఘువరుల
గని బెదరి వైరిజను
లని ఋష్యమూకాద్రి
ఆదరి పోయెడి భంగి
అట నుండి ఇట దూకు
ఇట నుండి అట దూకు
ఏ మందు ప్రాణ భయ మవుర!
ఏరికిని యెంత చెడ్డదిర!

తన రాజు సుగ్రీవు
తత్తరము గని మంత్రి
వరులు నల్వురు బెదిరి
పరువు లెత్తిరి అంత-

హనుమంతు డొక్కింత
ఆలోచనము చేసి
సుగ్రీవు కడజేరి
మూటిగా నిట్లనియె!

"సుగ్రీవా! నీ వొకింత
నిగ్రహించి యోచింపుము
నీ భయమున కర్థము లే
నే లేదది యెట్లందువ?

మనమున్నది మతంగాశ్ర
మము ఇచటికి రాడువాలి
కాదని వచ్చినచో తల
ఝల్లనుచు పగిలిచచ్చు!

ఇంక ధనుర్ధారులైన
ఇద్దరి సంగతి చూడగ

వాలి పంపునను వచ్చిన
వారేనని ఎట్లందువు?

వాలికి నిను చంపాలని
వాస్తవముగ మనసులేదు.
సోదరప్రేమకు లోనై
సుగ్రీవా! నిను చంపడు.

నీవతనికి చిక్కినపుడు
నిన్ను చంప కుండగనే
"పోరా! నీ వింకెప్పుడు
పోరుకు రాక" ని వదలెను.

ఈ వీరుల పైనముగన
ఏదో ప్రాణప్రదమగు
వస్తువు పోగొట్టు కొన్న
వారలవలె నగు పింతురు.

వారెవ్వరో తెలిసికొనక
వాలి పంపు వారలనుచు
భావించుట నీతొందర
పాటుగాక ఏమున్నది?

వారల పోలిక చూచిన
వాలి వంటి దుర్మార్గుని
సంగతి గొనువారు కారు
సహజ వీర వరులు వారు.

నీకెప్పుడు అనుమానమె
నీచేష్టలు పొరపాటే
నీవపార్థమున చెడితివి
నీ అభాగ్యమే మందును!
నిలుకడతో నిజమెరుగవు
నిజమాడితి కోపించకు!

వాలియె మాయావివల్ల
కూలె నంచు గుహమూసితి
వాలిచేత మాయావియె
కూలెనంచు నెంచవైతి.

నీ తొందర కాలిపోను
నిలుకడతో చూడవైతి
మంత్రులు చెప్పంగనె స
మ్మతి తెల్పితి గద్దె నెక్క-

రాజకీయ చాతుర్యము
పూజ్యమగుట మంత్రాంగము
చెడి పోయిన చందంబున
చెడితి వపార్థమున నీవు.
పవన వీచికలచే కం
పర మొందెడి దీపికవలె
నీ మనస్సు చంచలమై
నిలుకడ గోల్పోయె గదా!
ఇపుడు గూడ నీచేష్టలు
కపినై జము ప్రదర్శించె
వారెవరో తెలిసి కొనక
వైరులనుచు భావింతువు
నిలుకడతో నిజమెరుగవు.
నిజమాడితి కోపించకు.
నిజమెరుగుడి నిజమాడుట
విజయ మార్గదర్శనమాట."
హనుమంతుడు చెప్పినట్టి
గుణవంతము లైన పలుకు
లాలించిన సుగ్రీవుడు
అర్థమెరిగి యిట్లనియెను.

"హనుమంతా! నీవే నా
అనుమానము తొలగించుము.
మరల తప్పు చావేతను
జరుగ కుండగా జూడుము.

నీవే ఆ వీరుల కథ
కేగుమయ్య హనుమంతా!
నీవే ఆ వీరులెవరో
ఎరిగి రమ్ము గుణవంతా!

ఓ మంజుల చతురోక్తీ!
ఓ కార్యాచరణ శిల్పి!
నీకు తెలుసు వారలతో
నేక్రియ మాట్లాడ వలెనో!

మునుల వేషముల దాలిచి
ఘన దివ్యాయుధములూని
వారిచ్చటి కరుదెంచిన
కారణమును దెలిసి కొనుము."

ఆ మాటలు విన్నంతనె
హనుమంతుడు 'సరే' యనుచు
సామాన్యుని వేషములో
సమీపించె నా వీరుల-

## హనుమంతుడు

నమస్కార మార్యులార!
నళినపత్ర నయనులార!
దివి నుండిట దిగివచ్చిన
దేవుళ్లా? రాజర్షుల?
గంధర్వుల? కిన్నరులా?
కాక సూర్య చంద్రులా?
ఎవరయ్యా మీరిచ్చటి
కెవరి కొరకు వచ్చినారు!

కడు దవ్వుల నుండి నడచి
నడచి అలసి సొలసి పోయి
బడలికతో నిట్టూర్పులు
విడుచుచు మన్నారు మీరు ॥ఎవరయ్యా॥

ఎందులకీ ముని వేషా
లెందులకీ శరచాపము
లెవరి కొరకు వెదకుచు మీ
రిచ్చోటికి వచ్చినారు.

ఎవరయ్యా మీరలు మ
త్తేభయానముల వారలు
మోకాళ్లను దాకు తొండ
ముల చేతులు గలవారలు.

మీ శరీర కాంతులచే
మెరసిపోయె ఋష్యమూక
మెవరయ్యా మీరలు ఈ
భువనాలేలగ తగుదురు.

ఎగు భుజములు గలిగినారు
మగసిరితో మెరయువారు
పీన వక్షములతో గం
భీర గమనములతో మీ
రెవరయ్యా స్వాములు మీ
రిట దిరుగుచు నున్నారలు.

ఎవరి కొరకు వచ్చినారు?
ఇచ్చట తచ్చాడుతారు?

నా మాటలతీరు మీకు
నచ్చక పోయెనో ఏమో!
నా మాటల లోన దోస
మేమైనా వాటిల్లెనొ!

ఇంతగనే మాట్లాడిన
ఇసుమంతయు బదులాడరు
ఎవరయ్యా! మీరలు! మి
మ్మెరుగగ వచ్చినా తెల్పుడు?

పవన సుతుడ సుగ్రీవుని
పంపున నే వచ్చినాడ
మీరెవ్వరొ తెలిసి కొనగ
ఈ రీతిగ వచ్చినాడ!

నా నామము హనుమంతుడు
నా ఏలిక సుగ్రీవుడు
అతనికి నల్వురు మంత్రులు
అందులోన నే నొకండ.

అన్న తరిమి వేయగ ఆ
పన్నుడైన సుగ్రీవుడు
మీతో స్నేహము సేయగ
మిగుల నభిలషించినాడు.

సుగ్రీవుని పేరు చెవిని
సోకినంతనే రాముని
ప్రాణాలే లేచి వచ్చి
పలికెను సౌమిత్రితోడ.

"లక్ష్మణా! ఇతడు స
లక్షణుడు సుగ్రీవు
పంపునను మన కడకు
వచ్చె మన భాగ్యమిది.

మన మెవరి కొరకింత
దనుక వెదకుచు నుంటి
మట్టి సుగ్రీవుడే
అంపె మన కడ కితని.

ఇది అపూర్వ సంఘటనము
ఎద మయూరి పురి విప్పెను

మనసు విప్పి ఇతని తోడ
మాట్లాడుము లక్ష్మణా!

ఇతడు మధుర వాగ్భూషణు
డితడు మహా పండితు డీ
తడు వేదములన్ని చదివి
తరియించిన చరితార్థుడు.

వ్యాకరణము లెన్నో ప
ర్యాయములు పఠించియుండు
అట్లుగాక ఇంత సేపు
మాట్లాడిన గాని ఒక్క
అపశబ్దము రానీకను
అప్రసక్తములు లేకను
పునరుక్తులు దొర్లనీక
వినసొంపుగ మాట్లాడున?

వదనములో భృకుటములో
నుదుటను కనుచూపులలో
ఇంకను ఏ అవయవమున
ఏ వికారమును లేకను–

కంఠము కంపించకుండ
కరశిరములు త్రిప్పకుండ
గబగబగబ దబదబదబ
గళము జిమగు నట్లరవక-

అక్షరములు సగము మ్రింగి
ఆపి ఆపి మాట్లాడక
సందిగ్ధము దోచెడి వి
స్తార శబ్దములు వాడక-

ధైర్యము, మాధుర్యము, అ
త్వర, అక్షరముల పొందిక,
పదచ్ఛేదమును, లయయును
భాషణలో ప్రస్ఫుటింప-

వ్యాకరణ జ్ఞానము ప్రతి
వాక్యములో స్పష్టమవగ
స్వచ్ఛ సముచ్చారణలో
శబ్ద శుద్ధి విశద మవగ-

ప్రతి శబ్దము హృదయములో
పల నుండి గళమ్ము జేరి

మంద్ర స్వరమున బయటికి
మధురముగా వినరాగా-

రమణీయార్థము విరియగ
కమనీయ కళావచోవి
లాసములను విరజిమ్ముచు
తమ్యముగా మాట్లాడెను.

ఇది అపూర్వ సంఘటనము
ముద మొదవెను లక్ష్మణా!
మనసు విప్పి ఇతని తోడ
మాట్లాడుము నాయనా!"

రాముడిట్లని చెప్ప
లక్ష్మణుడు హనుమంతు
నకు బదులు మాట్లాడ
నయమొల్క నిట్లనియె!

"పండితుడా! నీ సుమధుర
భాషణములు మాకెంతో
తృప్తిని కలిగించె నమృత
వృష్టి బిళ్ల గురిసినట్లు-

దనువను దివిజుండు కబం
ధుని రూపున తటస్థించి
సుగ్రీవుని గూర్చి మాకు
క్షుణ్ణముగా నెరిగించెను.

సజ్జనుడౌ సుగ్రీవుని
సాయమభిలషించి మేము
చనుదెంచితి మయ్యా! ఓ
హనుమంతా! గుణవంతా!

భవ్యగుణుండిన సుతుతో
పనివడ్డది; మే మాతని
చెలిమి నిమిత్తంబు నీవు
చెప్పినట్లు చేయగలము."

అని లక్ష్మణుడు పలికి
నంత హనుమంతు డా
క్కొంత చింతించి తా
నిట్లు మది తలపోసె!

తన స్వామి కనుకూల
మునుగూర్చి తనియెంచి

తను కృతార్థుడ నైతి
నని మురిసి మోవిపై
చిరు నగవు చివురించ
చింతించె లోలోన.

"నరుల కెందుకు వా
నరులతో పని వడెను?
నర జాతితో మనం
దరి కేల పని వడదు?

నరులతో మనకు శూ
న్యముగద ప్రయోజనము
నరజాతికేల అం
దరి మీద పెత్తనము?

అయిన వీరెవ్వరో
అరసి కొందును గాక
ముందు వెనుకల జూచి
ముందరుగుదును గాక!"

అని ఇట్లు చింతించి
హనుమంతుడుచితరీ
తిని రాఘవుల తోడ
తెలివితో మాట్లాడె.

"ఎవరయ్య మీరు? మీ
కేమి పని మా తోవ?
వివరించు తయ్య? మీ
పేరేమి? ఊరేమి?

అంత లక్ష్మణుడు తన
అన్న అనుమతి పొంది
వివరించగా దొడగె
విపులముగ నీరీతి.

ధర్మ పాలకు డయో
ధ్యానగర పాలకుడు
దశరథ మహారాజు
తనయులము, రవికులము.

ఇతడగ్రజుడు నాకు
ఇతని తమ్ముడ నేను
రాము డీతని పేరు
లక్ష్మణుడు నా పేరు.

ధర్మ సంరక్షణా
ర్థమ్ము దీక్షను బూని

రాముడార్తుల నెల్ల
రక్షించ గలవాడు
శిష్ట శోషుల నెల్ల
శిక్షించ గలవాడు.

ధర్మజ్ఞుడితడు కృ
తజ్ఞుడీతడు యశో
ధను డీత డౌదార్య
గుణుడు సత్యవ్రతుడు.

జనకాజ్ఞతల దాల్చి
సతి జానకిని గూడి
నను తోడు గొని అన్న
వనములకు చనుదెంచె

దండకాటవిని గౌ
తమి తీరమున పర్ణ
శాల గట్టుక బ్రతుకు
సాగించు చుండగా—

రావణుడు మేమిద్ద
రము లేని సమయాన

మా వదినె సీత గొని
మాయమై చనినాడు—

అడ్డు వడ జటాయు
హత గాత్రు గావించి
వాడెచటి కేగెనో
జాడ తెలియదు మాకు

వదినెకై వెదకుచును
వన మెల్ల దిరుగాడు
తరి కబంధుడు తట
స్థమయి మాకు వివరించె—

సుగ్రీవు దీన కథ
క్షుణ్ణముగ నెరిగించె
అతనితో మా కార్య
మనుకూల మగుననియె—

కాన మీ నాయకుని
గన వచ్చి నాము!
అతని మైత్రిని మేము
అర్థించి నాము!

శరణన్న వారి ర
క్షణ సేయువాడు!
మీ రాజు శరణమును
గోరు చున్నాడు!

సర్వ భూతాలపై
జాలి గొను వాడు!
మీ స్వామి దయ కొరకు
కై సాచినాడు!

అని కంట తడి పెట్టి
ఆర్తితో లక్ష్మణుడు
వివరించగా గుండె
ద్రవియించ కవివరుడు—

అకట కట! ఎంత మా
టంటివయ! లక్ష్మణా!
మీరు సుక్షత్రియులు
మీరు ప్రజ్ఞా నిధులు

మిమ్ములను వెదకుచును
మేమె రావలసినది

మా భాగ్యమున మీరె
మము జేర వచ్చితిరి.

ఇనసూను దగ్గరకు
ఇక మనము పోదమని
తన సహజ రూపమును
దాల్చి పవన సుతుండు

ఇనవంశ దీపకుల
తన భుజమ్ములమీద
నెత్తుకొని వేగమే
ఋష్యమూకము నెక్కి—

దానిపై నొకచోట
దాశరధులను దించి
ఇనసూను గొనితెత్తు
నని చనియె కపి వరుడు.

తరణి సుతు కడకేగి
తన దౌత్య సాఫల్య
మును గూర్చి రామ ల
క్ష్మణుల సఖ్యము గూర్చి
చల్లగా నివరించి నాడు!
ఉల్లమున పొంగె కపిరేడు!

# స్నేహబంధం

హనుమంతుడిన సుతుని
తన వెంట దోడుకొని
ముచ్చటగ రాఘవుల
ముందునకు చనుదెంచె.

అపుడు సుగ్రీవుడమి
తానంద పరవశము
జెంది రామాదులకు
జేసె నభి వాదములు.

అంత రాముడు వాన
రాధిపుని వాత్సల్య
మున సమీపించి సా
చెను దీర్ఘ బాహువులు

చెలిమికై కన్నీళ్లు
చెలిమెలై ప్రవహించ
రామ సుగ్రీవులెద
రాపుడులు వడ స్నేహ

బంధంబు విడకుండ
బాహూ పరి రంభముల
దేలి పోయిరి బరువు
తేలికై పోయినటు—

ఉభయులది ఒక బాట
ఉభయులది ఒకమాట
ఒక రొకళ్లకు ప్రాణ
మొడ్డు స్నేహితులైరి.

అంత హనుమంతుడపు
డరణి కట్టెలు తెచ్చి
అగ్ని రగిలించి మ
ధ్యన పెట్టె సాక్షిగా—

వినయ ముట్టి పడంగ
ఇన సుతుడు సుగ్రీవు
డపు డగ్ని సాక్షిగా
ఆర్తుడై ఇట్లనియె!

"స్వామి! రామప్రభూ!
శరణు జొచ్చితి మిమ్ము.
నన్ను వానరుని ఆ
పన్ను నేలు కొనంగ
నా స్నేహ మర్థించి
నా దగ్గరకు వచ్చి
నను సత్కరించితిరి
నన్నుద్ధరించితిరి
నాపాలి దైవములు మీరు!
నన్నేలగా వచ్చినారు!

ఇది నాదు భాగ్యంబు
ఇదె సాచితిని చెయ్యి
చేతిలో చెయి వేసి
చెలిమి ముడి బిగియించు

నీ సుఖమె నా సుఖము
నీ దుఃఖమే నాది
ఇక మనకు భేదమ్మె
ఇసు మంతయును లేదు
ఇది నమ్ము నమ్మమో రామ!
ఇన వంశ కలశాబ్ధి సోమ!

ఇల సుతను రావణుం
డెచ్చోట దాచినను
వెదకి తెత్తును జాత
వేది సాక్షిగ నేను
ఇది నిజము నమ్ము శ్రీరామ!
ఇన వంశ కలశాబ్ధి సోమ!
అని ప్రతిజ్ఞ యొనర్చెనపుడు!
ఇన సుతుడు సుగ్రీవు డతడు!

అంత రాముడు వాన
రాధిపుని చెయిలోన
చెయివేసి స్నేహాతి
శయముతో గట్టిగా
పట్టుకొని నలుపుచును
పరి రంభముల దేల్చి

ఘనుని వలె గంభీర
కంఠ గర్జలతో ప్ర
తిజ్ఞ జేయుచు బలికె
దిగ్దిగంతా లదర!

"ధర్మ రక్షణమె నా
ధర్మంబు దుర్మార్గ
వర్తనుల వంచకుల
వధియించుటే నాదు
విధిగ భావింతు నిక
విధి గాచుగాక వా
లిని చంపుదును నమ్ము సఖుడ!
నిను రాజు జేసెదను హితుడ!

బంధు మిత్రులను ఆ
పన్నులను ఆదుకొను
టది పరమ ధర్మమని
మది నెంచెదను గాన
ఆప్తుడవు ఆశ్రితుడ
వర్క సూనుడ వీవు
నీ శత్రువగు వాలి
నా శత్రు వెటుగాడు?

ధర్మ సంఘాతకుడు
దుర్మార్గ వర్తనుడు

వాలి దుశ్శీలి నీ
ఆలినింగొని పోయి
నట్టి నీచపు వంచ
కాధముని వధియించి
తీరుదును నమ్ము నా
తీక్ష్ణమగు బాణాలు
పగబట్టి నట్టి స
ర్పాల వలె క్రూరమై
ఘోరమై కఠినమై
గురి తప్పనట్టి వై
వాలి రొమ్మును జొచ్చి
వధియించి తీరునవి.
నీ రుమను చేకూర్తు
నిన్ను రాజును జేతు.
అనుమానమేల కపివర్య!
హతుడయ్యె వాలి వినుమయ్య!
తనకు హితమగు మాట
వినినంత సుగ్రీవు
డానంధమున కనుల
నశ్రుకణములు రాల్చె!

మను వంశ తిలకుండు
మార్తాండ సూనుండు
చెలిమి కట్టడలు చే
సిన ముహూర్తము లోన

లంకలో సీతమ్మ
పంకేరుహము వంటి
ఎడమ కన్నదరినది.
పుడమి పులకించినది.

అప్పుడే నిప్పుకణ
మగు రావణాసురుని
ఎడమ కన్నదరినది
పుడమి పులకించినది.

తప్తకాంచప మట్లు
తనరు ఇంద్రాత్మజుని
ఎడమ కన్నదరినది
పుడమి పులకించినది.

శ్రీరామ నీకరుణ
చేత నాసతిని రా
జ్యేందిరను పొందగల
నిక నీవు వాలిని వ
ధించ వలె నన్ను ర
క్షించవలె నప్పుడే
రాజు నై సైన్యముల
రప్పించి నీ సతిని
వెదకించ పంపగల
వేగ నలు దిక్కులకు.
కనుక వాలిని ముందు
దునుమ వలె నీవు
కాకున్న కష్టాలు కడతేరలేవు!

మీ విషయ మంతయును
నే వింటి హనుమచే
మీరు లేనపుడు దు
ర్మార్గుడగు రావణుడు
సీత నెత్తుక పోయె,
చెనటి వాడెందేగి
నను వాని కనిపెట్టగలను!
నను నమ్ము సూర్యపుత్రుడను!

మత్స్యావతారుడై
మధుకైటభుల జంపి
విష్ణు వేరీతిగా
వేదముల గొనితెచ్చె
నారీతిగా నేను
ఆ రావణుని జంపి
నీ సీత గొని తెచ్చి
నీకు నర్పించెదను.
ఇక నీవు దుఃఖించ వలదు!
ఏను కపినని తలచ వలదు!

## నగలమూట

ఆ మదికి తట్టె నా
డాకాశ మార్గాన
రాక్షసుండొకడు తన
కక్షనబలను బలా
త్కారముగ బట్టుకొని
పారి పోవుచు నుండ
కనుగొంటి నేనపుడు రామ!
ఇన వంశ కలశాబ్ధిసోమ!

ఇంక విను రాక్షసుని
అంక మందా అబల
గళము శోషిల్లగా
గట్టిగా అరచుచును
గ్రద్ద బట్టిన నాగ
కాంత వలె విలపించి
పెనుగు లాడుచు పట్టు
విదలించు కొన లేక
హా! రామ! హా లక్ష్మ
ణా! యనుచు నేడ్చుచును
భూమి మీదకు జూచె
మేము కనిపించితిమి.

మము జూచి ఉత్తరీ
యము చింపి దానిలో
నగలు కొన్నింటి మూ
టగ గట్టి మావైపు
క్రింద బడ వైచగా
నందు కొంటిమిదాని.

ఆ మూట దాచియున్నాడ!
అది దిచ్చెదను చూడు రేడ!
అనినంత రాముడా
త్రిని జెంది యిట్లనియె-

"హితుడ! నీవాలస్య
మేల చేసెదవయ్యా!
తత్ క్షణమె పో పొమ్మ!
దాని నిట గొని తెమ్మ!"

అని నంత సుగ్రీవు
డాత్రమున పరుగెత్తి
నగల మూటమ తెచ్చి
రఘువరుని ముందుంచె-

అది అందుకొని రాము
డాత్రమున ముడివిప్పి
నగలుగని నయనాల
పొగమంచు చందమా
మను గప్పినట్లు రా
మునకు కన్నుల నీళ్లు

గమ్మెకొని చూపంద
కను "తమ్ముడా చూడు!
ఈ నగలు మీ వదిన
వేమొ!" యని గద్గదిక
కంఠమున బలుక ల
క్ష్మణుడిట్లు బదులాడె!

"ఈ బాహు పురులెరుగ
ఈ కుండలా లెరుగ
ఈ అందెలను మాత్ర
మెరుగుదది యెట్లన్న-

ప్రతిదినము వదినమ్మ
పాదాభి వందనము
సలుపు చుంటిని కాన
తెలిసెనివి వదినవే!"-

లక్ష్మణా! నీ వెంత
లక్షణో పేతుడవు
యుగ యుగమ్ముల నుండి
జగమెల్ల నీ వలన

మగువలను మన్నించు
మర్యాద నేర్పినది.
భరత సంస్కృతివెలసి
స్థిరముగా నిలచినది.

నీ నిర్మలోపేత
నీతి వర్తన చేత
మానవతి జాతి కభి
మానమని ప్రాణ మని
జగతి గుర్తించినది
చరిత కీర్తించినది.

అందెలు వదినమ్మ వనుచు
అనుజుడాడి నంతటనే
రాముని కన్నుల జలజల
రాలె బాష్ప కణ జాలము

అవనీసుత అడుగులిడగ
అందెల సవ్వడి వీనుల
వినపడి నట్లని పించగ
కను దమ్ములు చెమ్మగిలెను.

సీతాస్మృతి పవన వీచి
ఝృంభించిన యంతటనే
విరహాగ్ని మరింత రేగి
వేధించెను రఘురాముని.

శోక తప్తుడై రాముడు
సుగ్రీవునివైపు దిరిగి
"కపీశ్వరా! నా ప్రాణము
కన్నమిన్న నాప్రియసతి
రావణు డెత్తుక పోవుట
నీవు చూచినావుకదా!

ఎవడా రావణుడు వాడు
ఎచటి కెత్తుకొని పోయెను
వాడెచ్చట నివసించును
వాని జాడ నెరిగింపుము.

నా ప్రాణము కన్నమిన్న
నాప్రియురాలిని సీతను
బలాత్కారముగ బట్టుక
పారిపోయె నెచ్చోటికి?

ఎవడా రాక్షసుడు వాడు
ఇంతగ తెగియించినాడు
తన మరణార్థము మృత్యు
ద్వారాలను తెరచినాడు.

వాడెచ్చటి కేగినాడు?
వాడెచ్చట నివసించును?
వాని జాడ నెరిగింపుము.
వాని నిపుడె వధియింతును.

ఎరిగింపుము సుగ్రీవా!
ఎవడా రాక్షసుడు వాడు?
తన నిమిత్తమె సమస్త
దనుజ నాశ మెంచినాడు.
తన మృత్యు ద్వారాలను
తనకు తానె తెరచినాడు.

## సుగ్రీవుని ఓదార్పు

రాముడిట్లు దుఃఖముతో
రగిలిన పెను కోపముతో
అశ్రు పూరి తాక్షులతో
అతి దైన్యముతో బలుకగ-

కపినాథుని సుగ్రీవుని
కన్నులంత చెమ్మగిలెను
గద్గదికము కంఠములో
గదుర నిట్లు బదులాడెను.

"రామా! ఆ దనుజుడు నీ
రామ నెటకు గొని పోయెనో!
వాడెచ్చట నివసించునో!
వాడెంతటి సమర్థుడో!

నేనెరుంగ కానీ నీ
తో నేనిదె శపథము జే
సెద విను నా మాట నమ్ము!
సీతను నీ కర్పింతును.

వాడెచట దాగినను
వానినే కనుగొందు
వాడెంత వాడైన
వాని అంతును దేల్తు.

వాడెవ్వడైన నీ
తోడు వాని వధించి

తీరుదును నీ వగపు
తీరుదను అర్పెదను.

రామ! నీకొరకు నా
ప్రాణాలు వడ్డింతు!
నీ సీత నెనైన
నీకు నే నర్పింతు!
నేనుండి చింతించ వలదు!
నిత్య దుఃఖము చేబు తగదు!

ధీరుడవు వీరుడవు
ధీమతవు గారాదు!
ధైర్యమున నుండుటే
ధీరులకు మర్యాద!

బరువెక్కువై పోయి
పటవ మునిగిన రీతి
నిరతమ్ము శోకించు
నరుడు చేటును బొందు.

నేను నీవలె నుంటి
కాని నీ వలె సంత
తము దుఃఖ పడకుండ
ధైర్మమున నున్నాడ!

నేమంటి చింతించవలదు!
నిత్యదుఃఖము చేటు తగదు!

ధీరుడవు నీకుపదే
దేశించుటను గాదు
హితము జెప్పితిని స్నే
హితుడ నౌటను నీకు!

రామ! నా స్నేహమ
ర్యాద మన్నించి ఈ
దుఃఖమును విడువు నీ
తోడు నే నున్నాడ!"

ఆ మాట విన్నంత
రామ మూర్తికి కనుల
అశ్రులహరులు నాట్య
మాడినవి; అవియే కృ
తజ్ఞతా మృత పూరి
తములు వాటికి అవధు
లేర్పడగలేదు ఆనాడు!
లేర్పడగ లేదు అ నాడు!
కన్పడవు అట్టి వీ నాడు!

రాముడంతటి వాడు
రవ్వంత మేలు చే
సిన వారి కిట్లు చే
సెను కృతజ్ఞత నతులు!

తన కెవ్వరేని మే
లొనరించ ధన్య వా
దములు చెప్పడు తనకు
దర్ప లోప మటంచు
ఈ నాటి మానవుడు చూడు!
ఎంతటి కృతఘ్నుడో వాడు!

## రాముని ప్రశ్న

హితుడా! స్నేహితుడా! నా
హితము గోరి నన్నెంతో
ఓదార్చితివిక నా మది
కూరట చేకూరు చుండె!

నీవలె ఆపదలయందు
స్నేహితులు లభించుట బహు
దుర్లభము గదయ్య! స్నేహి
తులు పెక్కురు సుఖము లందు.

హితుడా! స్నేహితుడా! నీ
విఁక సీతను వెదకించుము!
ఆ రావణు డెక్కడుండు
నో రయమున కనిపెట్టుము!

వానరవర! నీ పనులిఁక
వర్షర్తువు నందు క్షేత్ర
ములు ఫలించునట్లుగ నా
వలన నీకు నెరవేరును.

నీపై అభిమానముతో
నీ వైరిని వాలిని వధి
యింతు నన్నమాట నిజము.
ఇది యథార్థమని తలచుము.

అవునుకావి సుగ్రీవా!
ఆ వాలికి నీకు వైర
కారణ మేమిటి నీ నిజ
దారను వాడేల పట్టె?

అని అడిగిన శ్రీరాముని
కిన సూనుడు వివరించెను
వాలికి తన కేరు పడిన
వైర కారణము గూరిచి.

## వైర కారణము (మాయావి)

రామా! మేమన్నదమ్ము
లము బాగానే యుంటిమి
కలకాలము ఇట్లాగే
గడచి పోవు నను కొంటిమి.

అయితే ఒక నాటిరేయి
అసురుడు మాయావి ఒకడు
"ఓరీ! వాలీ! నాతో
యుద్ధానికి రారా!" అని
గవిని ముందు గర్జించుచు
కయ్యానికి కాలుదువ్వె!

పోరు పిలుపు విన్నంతనె
పౌరుషాగ్రహావేశము
లుప్పొంగ నుపేంద్ర సుతుడు
'ఒప్పిరి సింగా' యటంచు

జబ్బ చరచి గర్జించుచు
చయ్యన బయటికి వచ్చెను.

అంతట విభ్రాంతి జెంది
అంతఃపుర కాంత లెల్ల
పైటలు జర్రున జారగ
పరి వేష్టితలై వచ్చిరి.

అప్పుడు మా అన్నవాలి
ఆగ్రహోగ్రదగ్రుడగుచు
"ఓరీ! మాయావీ"! అని
హూంటా హూంటిని యుద్ధానికి
దూకులిడుచు పోగానే
తోడుగ వెంబడి వెళ్ళితి.

అసురుడు మమ్మీద్దరగని
అదరిపోయి పలాయనము
చిత్తగించె, కాని వాని
జీవించగ నీరాదని
వాని వెంట బడితి మపుడు
వాడొక బిలమును జొచ్చెను.

అంత వాలి నన్నుజూచి
ఆజ్ఞాపించెను తానిటు-
"సుగ్రీవా! నీవిటనే
విగ్రహమున నుండుమునే
బిలములోన వెళ్ళి అసురు
పీచ మడచి వచ్చు వరకు".

"అన్నా! నీవెంట నే
నరుదెంచెద నన్నను విన
కుండ నన్ను బిలము ముందు
నుండు మనుచు ఒట్టుబెట్టి
తాను బిలము జొచ్చినాడు
నేను బయటనే యుంటిని-

ఒక సంవత్సరము గడిచె
ఓపికతో నుంటి కాని
బిలము నుండి నెత్తురు నురు
గులతో బయటికి వచ్చెను.

నేనది గని భీతి జెంది
నిస్పృహపడియుంటి నపుడు
అసుర జయ ధ్వానమ్ములు
అన్న భయా క్రోశనములు

వినవచ్చెను నే మరింత
భీతిలి నిర్వీర్యుడనై
అన్న చంపబడెనిక నను
అసురుడు వధియించు ననుచు-

బయటికి రాకుండు నట్లు
బంధించెద వాని ననుచు
బిలద్వారమునకు మహా
శిలను మూతగా వేసితి.

ఖిన్న మనస్కుడనై నే
కిష్కింధా నగరానికి
వచ్చితి నీ సంగతి నె
వ్వరికి చెప్పకుండదాచి
తిని కానీ మంత్రులెట్లొ
కనిపెట్టిరి, నాకు పట్ట
మును గట్టిరి బలాత్కార
ముగ నేనపు డేమిసేతు?

ఏనట్లు కొన్నాళ్లు
ఏలికగ నుండగా
వైరి వధ గావించి
వాలి రానే వచ్చె.

పట్టమును గట్టుకొని
పాలించు నను జూచి
కనుల నిప్పులు రాల్చె
కఠినముగ మాట్లాడె!

నను తిట్టె నా మంత్రు
లను ఖైదులో పెట్టె!
నా కళ్ల ముంగటనె
నా సతిని చెరపట్టె

అతని కోపదవాగ్ని
ఆకాశమంటు కొనె!
భూన భోంతరమెల్ల
బగలు సెగలలముకొనె

శౌర్యమున నిగ్రహిం
చగ శక్తి నా కప్పు
డున్న నా అన్నయను
ఉరు గౌరవము తోడ
అంతపనికి తెగించ
నైతినో. శ్రీరామ!
మంచితనమున కిదియ ఫలము?
మదమత్సరుల కెంతబలము!

పట్టణములో నడుగు
పెట్టగానే అతని
పాదాలపై వ్రాలి
భక్తి సాష్టాంగ పడి.

అభివందనాలతో
అర్పించితిని కాని
అతడు నను దీవించ లేదు!
అతడు నను కరుణించలేదు!

నా కిరీటము దీసి
నతులతో నతని పా
దాలపై మోపితిని
దండాలు పెట్టితిని.

కాని అతని లోని
కాల కర్కోటకుడు
కస్సుమని బుస్సుమని
కసిరి కొట్టెను నన్ను
అతని కోపము ఆరలేదు!
అతని తాపము తీరలేదు!

అన్న కోపాగ్ని చ
ల్లార్ప నోదార్చితిని.
కై మోడ్చి వినయ మొ
ల్కఁగ బతిమి లాడితిని.

అన్నయా! నీవు మా
అదృష్టమున శత్రు
వును జంపి క్షేమముగ
పురమునకు వచ్చితివి.

నే ననాథుడను నీ
వే నాకు నాథుడవు
నేను నీ సేవకుడ
నీవె మా ఏలికవు
శ్వేత ఛత్రము పట్టువాడ!
సేవకుడ దయజూడు రేడ!

ఏడాది గడిచి పో
యిన గాని బిలముఖము
కడకాచుకొని యుంటి
కాని ఒక నాడేమొ!

బిలము లోపలనుండి
జలజలా మరుగుతో
రక్త ప్రవాహాలు
రాసాగె భయపడితి.

అపుడకట! నా యింద్రి
యములు స్వాధీనమ్ము
తప్పినవి నా గుండె
ఉప్పగా కూలినది.

నీవు రాకుండుటను
నేను భయపడి పోతి
మాయావి గెలిచెనని
మతిపోయి నట్లయితి.

నీ దెబ్బలకు వాడు
నెత్తురులు గక్కుకొని
నీ గొంతుతో నరచి
నిను నన్ను వంచించె
నని గ్రహించక పోతినేను!
అన్న! నే వంచకుడ కాను!

వాడు బయటికి వచ్చి
వధియించు నన్ననుచు
బిలము బయటికి వాడు
వెడలి రాకుండు నటు
మూసితిని గిరిశిఖర
మును తెచ్చి నే నట్లు.

నా భయమె నన్నట్లు
నడిపించినది కాని
నీకు చెడు తలం పెట్టి
నే నేతునా అట్లు?

తిరిగి వచ్చిన యంత
పురజనులు మంత్రులును
రాజ్యనాశ భయాన
రాజు జేసిరి నన్ను.

బల వంతముగ నన్ను
పట్టాభిషిక్తుని గ
నొనరించిరే కాని
మనసు పడి నే కోర
లేదు మన్నింపుమని
పాదాలపై బడితి.

వీరాజ్యమిది దీని
నీ వేలు కొనుమంటి
నీ సేవకుడను మ
న్నింపుమని నేనంటి.

కాని ఆతని మనసు
కరుగ లేదింతైన
ఘనుడెంత కురిసినా
కఠిన శిల కరుగునా?

నన్నుతిట్టి నను కొట్టి
నాసతిని లాగుకొని
కట్టు బట్టలతోడ
కని కరము లేకుండ

నను తరిమి తరిమి కొ
ట్టెను చూడు వీడు!
నా కన్నయై చేయు
నా యిట్టి కీడు!

సచివాది విబుధజన
సభలోన నమహీన
పరచి నా ఆతినే
బలవంతముగ లాగి
కొని నన్ను తన్ని తరి
మెను చూడు వీడు!
అనుజునిటు సేయునా
అన్నయగు వాడు?

పలు మార్లు నేనెంత
ప్రార్థించినను గాని
పాదాలపై వ్రాలి
బ్రతిమి లాడిన గాని
వినిపించు కొనకుండ
కనికరము లేకుండ

తమ్ముడని రవ్వంత-
దయలేక నన్నిట్లు
తన్ని తరిమెను చూడు రామ!
ధర్మమా ఇది? సుగుణధామ!

అంతటితో ఆగకన
న్నంతము గావించ నెంచె
సుగ్రీవుడు బ్రతికి యున్న
సుఖమే లేదని తలంచె!

వాని క్రోధ మేమందును?
వాని కుటిల మే మందును!
వాని మోహమేమందును?
వాని దాహ మేమందును?

వాని లోభమేమందును?
వాని కామ మేమందును?
వాని మదము వాని అహము
వశము గాదికే మందును?

నేను లేనిచో రాజ్యము
నిష్కంటక మగునను కొనె!
నేను లెనిచో నా రుమ
నిజసతి యగునని అనుకొనె!

అడవులలో తల దాచుక
పడియుండిన కానీ నను

విడువకుండ వెంటాడుచు
వెదకి వెదకి చంపనెంచె!

ఇదియే మా వైరహేతు
వింతకన్న వేరు లేదు.
ఏదోషంబెరుగని నా
కీదుఃఖమదేల చూడు!

శ్రీరామా! నీవు మహా
వీరుడవు సమస్తలోక
ముల కభయ మొసంగు వాడ
విలలో నీసాటియెవరు?
నే వాలికి భయపడి వి
న్నే వేడితి శరణ మిమ్ము!
ఆ వాలిని గూలిచి నా
కభయ మొసగి కాపాడుము!

ఆ మాటలు విన్న రాము
డల వోకగ నగుచు బలికె_
హాసమొ! అదిలేక చంద్ర
హాసమొ! ఆ రామ చంద్రు
మందహాస మందలి మ
ర్మము దెలిసిన వాడెవ్వడు?

"సుగ్రీవా! భయపడకుము!
చూడు మదీయాస్త్రంబులు
సూర్యునివలె తీక్ష్ణములై
చొచ్చుకొనును వాలి రొమ్ము!

వాడు మృగ ప్రాయుడు వే
టాడి చంపదగిన వాడు!
వాడగు పడి నంతనె నా
వాడి బాణమున చచ్చును.

నీ భార్యను చెరపట్టిన
నీచుడు నా బాణాలకు
ప్రాణాలను వీడకుండ
బ్రతుకలేడు బ్రతుకలేడు!

సుగ్రీవా! నీ వేటికి
శోష పడెదవయ్యా! ఆ
వాలిని వధించి నిన్ను
నేలికగా జేతు నమ్ము!

నీ వేటికి దుఃఖించెదు
నీ భార్యను విడిపించెద!
ఆ వాలిని చంపి నిన్ను
అధినేతగ నొనరించెద!

నా దుఃఖమె అనుకొంటే
నా కంటే దుఃఖ సము
ద్రములో మునిగితివి నీవు
దరి జేర్చెద నిన్ను నమ్మ!"

అని పలికిన మాటలు వి
న్నంతటనే సుగ్రీవుడు
పరమానందము జెందుచు
ప్రణమిల్లెను రామయ్యకు.



# సీతాన్వేషణ

## దుందుభి

ఇంకను వినురామా! నే
నీనాటికి బ్రతికియున్న
కారణమీ ఋష్యమూక
మే రక్షణగానుండుట.

కాకుండిన నన్ను త్రిలో
కాలలోన వాలి నుండి
కాపాడగలట్టి వాడు
ఘనుడెవడీ గట్టుకన్న!
దీని రహస్యము చెప్పెదు
వీనులార వినుము! మహా
[illegible]యుడు దుందుభి యను రా
క్షసుడు రణోన్మాది ఒకడు.

వాడు మహా బలవంతుడు
వాడు మహా గర్వాంధుడు
వాడు మహా దుష్టాత్ముడు
వాడు మహా దుర్మార్గుడు.

కనులు నెత్తి కెక్కి మదం
బున పెద్దల తూలనాడు.
ఒకనాడు సముద్రునితో
యుద్ధోన్మాదమున చెలగి—

ఓరీ! సాగర! నాతో
యుద్ధము సేయగ రారా!"
అని సవాలు చేసె నంత
అంబుధి ఇట్లని పలికెను.

"రణ పండితుడా! నీతో
రణము సేయ నాకు గాదు
హిమ వంతుడు నీతో సమ
రము సేయగ తగిన జోడు"

తనకు సముద్రుడు భయపడె
నని దుందుభి వింట నుండి
విడువ బడిన బాణమువలె
వడిగా హిమగిరి కేగెను.

కొమ్ములతో హిమవంతుని
కుమ్మి కుమ్మి నొప్పించెను

శ్వేత గజేంద్రము లంతటి
శిలల జిమ్మి గర్జించెను
అంత దుందుభిని గని హిమ
వంతు డిట్లు వచియించెను-
"ఓ దుందుభి! నీ తో నే
యుదము సేయగ జాలను.
సమర కర్మలందు నేను
సమర్థుడను కాను కాను.
అంతే గాకుండగ వసి
యింతురు నాయందు మునులు
కావున నా చేత సమర
కార్యములవి కాని పనులు"
ఇట్లు శాంతముగ పలికిన
హిమవంతుని మాటలువిని
గర్వ మదముతో దుందుభి
కఠినముగా నిట్లు బలికె-
"సమర కర్మలందు నీవు
సమర్థుడవు కావో! లే
కే నాకే భయపడి నీ
విట్లు పలుకు చున్నావో!

ఆది అంతయు నాకేటికి
కదనము నే కోరుచుంటి
నాతో పోరాడు(వాడు
నాకు చెప్పరా? ఎవడో?"

ఆ మాటలు విన్నంతనె
ఆగ్రహించి హిమవంతుడు
వీనికి గుణ పాఠమునే
ర్పింతు నంచు నిట్లనియెను.

"అయితే కిష్కింధకు నీ
వరుగు మిప్పుడే అచ్చట
వాలి యనెడి మహా వీరు
డాలము సేయగ నీతో
తగిన జోడు వాని తోడ
జగడ మాడ పో పొమ్మిక!

సమరము చేయగ నిజముగ
సంబరమే నీ కుండిన
రయమున ఆ వాలి దగ్గ
రకు వెళ్లుము దుందుభీ!"

ఆ మాటలకు వాఁడు
ఆగ్రహో గ్రోన్మాదు
డై వచ్చె కిష్కింధ
కావాలితో పోర.

కిష్కింధ కోట వా
కిట ముందు వచ్చి భీ
కర సింహనాద సం
గర భయంకర ఘోర
దుందుభులు మ్రోగించినాడు!
దుందుడుకు దుందుభుడు వాడు!
వాలినెదురించు రాక్షసుడు!
వాడెంత యుద్ధ కాముకుడు!
తొడగొట్టి సవాలు సేయు
దుందుభి రంకెలు వినబడ
వాలి చివాలున లేచి స
వాలు నెదుర్కొన వచ్చెను.
అపుడంతఃపురము నుండి
కపినాథుడు కాంతలతో
చుక్కలతో గూడి వచ్చు
సోముని వలె భాసిల్లెను.

"ఓరీ! దుందుభి నగర
ద్వారము కద నీవూరక
అరచుచుంటి వేటికి నీ
కసువులపై ప్రీతి లేద?

ఆ మాటలు విన్నంతనె
అసురుడుగ్రుడై యిట్లనె
ఔరా! వానర! నీ వొక
వీరుడవా! శూరుడవా!
ఆడవాళ్ల ముందు గొప్ప
లాడకురా! పోరుకురా!

కోతుల రాజువులేరా!
కోతలు కోయకు రారా!
నీ శౌర్య పరాక్రమాలు
నిముషములో తేల్చెదరా!

కాకుంటే పోనీలే
కాంతలతో మన్నానని
అంటావా! ఈ రాతిరి
కవధినిత్తు ననుభవించు".

అంత వాలి పరమ కుపితు
డై దుందుభిపై దూకెను
వారిరువురి పోరాటము
ఘోరార్ణవమై పోయెను.

తుదకు వాలి గర్జించుచు
దుదుంభి కొమ్ములను బట్టి
గిర గిర గిర త్రిప్పి త్రిప్పి
ధరణి మీద బడ గొట్టెను.

అట్లు గొట్టబడి దుందుభి
హతుడయ్యెను నెత్తుగ్రక్కి
వాని క బరము నెత్తి
వాలి కేళిగా నట్టిటు
అడించుచు విసరివైచె
అది అమడలోన బడెను.

విసరివేయ బడుటచేత
అసురు కళేబరము నుండి
రక్తబిందువులు స్రవించి
రాలె మతంగాశ్రమమున.

అమ్మతంగ మౌనీంద్రుడు
అందుకు కోపించి శపిం
చెను వాలిని, తన ఆశ్రమ
మునకు చుట్టు ఆమడ దూ
రములోనికి వచ్చిన మర
ణము తప్పదు వాని కనుచు—

ఇంకను ఆ వాలి జనము
ఈ వనమును వదలి వెళ్ల
వలయును రేపటి లోపల
శిలలగుదురు లేకుండిన.

మునిశాపము వలన ఋష్య
మూక పర్వతమును వాలి
ప్రవేశింప నొల్లడు—భయ
పడు దానిని చూచూటకును.

తత్కారణమున నేనీ
ధరా ధరము నెక్కియుంటి
దీని మీద యెన్నాళ్లని
దిగకుండగ నుందు చెప్పు?"

## రాముని అభయం

రామా! వాలిని చంపుము!
రక్షింపుము నను శీఘ్రము!
దాసోహమ్మంటిని నా
దారను నా కిప్పింపుము!"

అని సాష్టాంగంబులువడి
అతి దైన్యముతో బలికిన
భాను సుతుని లేవనెత్తి
పరిష్వంగమున దేలిచి—

"హితుడా! స్నేహితుడా! నీ
వీగతి దుఃఖించ వలదు!
ఈ క్షణమే వాలిని వధి
యింతును దుఃఖించ తగదు

నీ దారను నీ రాజ్యము
నీకు నేను జేకూర్తును
నీ విక సుఖియించగలవు!
నిశ్చయమిది! నిశ్చయమిది!

పదపద! ఆ కిష్కింధకు
బాట జూపు పోద మిపుడె
వాలిని యుద్ధంబునకు స
వాలు చేసి పిలువ మిపుడె!

వాలిని వధియింతును, ని
న్నేలికగా జేతునిపుడె!
పద పద! ఆ కిష్కిందకు
బాట జూపు పోదమిపుడె!

వాడు మృగ ప్రాయుడౌట
వాని మృగంబును వలె వే
టాడి చంపుదును నీవిక
ఆ వాలిని చూపింపుము!

పద పద! ఇక కిష్కింధకు
బాట జూపు పోద మిపుడె!
ఆ వాలి మృగంబును వే
టాడి చంపి వైతు నిపుడె!"

## కిష్కింధకు పయనం

రాముడిట్లని నంత
నే ముదాంబుధి దేలి
రాఘవుల దోడుకొని
రవిసుతుడు ముందరిగె!

విల్లంబులను దాల్చి
వెనుక రాముడు రాగ
ఆ వెనుక లక్ష్మణుడు
ఆంజనేయుడు నలుడు
నీలుడును తారుడును
నీడలటు చనుదెంచ—

రొమ్ము విరుచుక తీక్ష్ణ
రూక్ష తేక్షణలతో
కిష్కింధ పురివైపు
కినుకతో చూచుచును

పెద పెద్ద అంగలిడి
పెను బాముపలె బుస్స

బుస్సుమని విట్టూరు
పుల విడుచుచును సూర్య
నందనుడు వడివడిగ
నడవ సాగెను ముందు!
దండి సఖు డండగా నున్న
కొండంత వాడగును రన్న!

## సప్తజనాశ్రమం

కనుల పండువు గొల్పు
వనము సప్త జనాశ్ర
మము వచ్చె బడలికలు
మటు మాయమై పోయె!

ఆ వింత నెరిగింపు
మని రాము డడుగ సు
గ్రీవుడా ఆశ్రమ
శ్రీ మహిమ వివరించె-

"రామా! ఇది సప్త జనా
శ్రమ మిచ్చట సప్తమునులు

సప్త శతాబ్దాలు తపో
సాధనగావించి స్వదే
హములతోడ స్వర్గమేగి
రవు రూపంబిది చూడుము!

ఈ ఆశ్రమమందు శ్రమకు
ఏ మాత్రము తావుండదు.
ఇందునుండి గుప్పుమని ప
సందు మీర ఘుమ ఘుమ వా
సనలు జిమ్మ, మధురమైన
సంగీతము వినిపించును.

నగల సవ్వడులు సుమధుర
నాట్యకళా మంగళ వా
ద్యాలు వినగ వచ్చును రాత్రే
తాగ్నులు వెలుగుచు నుండును.

ఎవరైనా తెలియ కిందు
నేగిన బయటికి రారిక
అందే మరణించి పోదు
రందుకనే పక్షులైన

అటు వంకను తొంగిచూడ
వదే సప్త జనాశ్రమము.

రామన్నా! లక్ష్మన్నా!
నమస్కార మొనరింపుడు!
ఋణగ్రస్తు రుజగ్రస్తు
డెవడైనా కాని గాక
ముక్తుడౌను రక్తుడౌను
శక్తియుక్తుడై పోవును".

వారలంత భక్తి నమ
స్కారము లొరించినారు.
అట్లే సుగ్రీవాదులు
అభినతు లొనరించినారు.

## వ్యూహం

సప్తజనాశ్రమము దాటి
సాగిపోయి రదె కిష్కిం
ధానగరము కాన వచ్చె
కాని రాము డాగి పోయె!

"నగరములో ప్రవేశించ
నాకు కూడదిక వాలిని
పురిబైటికి రప్పింపగ
ఘోర కేక పెట్టి పిలువు!

వనవాసము గడువు గడుప
వలసియున్నదింకను నగ
రము లోనికి ప్రవేశించ
రాదు నియమ భంగమగును.

నీవే విధియైన గాని
ఆ వాలిని కిష్కింధా
పురి బయటికి రప్పింపుము
ఘోరు సేయ కవ్వింపుము.

వాలి కంటబడి నంతనె
వాని వధించెద తప్పక
నిర్భయముగ నీవిక ఆ
నీచుని వాలిని బయటికి
రణ గర్జన గావింపుచు
రప్పింపుము సుగ్రీవా!"

అని స్పష్టముగా పలికిన
ఇనకుల భూషణుని తోడ
ఇనసుతు డుప్పొంగి పోయి
వినయ మొప్ప నిట్లనియెను.

"రామా! నీ రక్షణలో
ధీమాతో నున్నాడను
నీ వండగ నుంట చేత
నే వాలి నెదిర్చ గలను.

మును పు నాకు కిష్కింధా
పురము వంక చూచుటకే
గుబులెత్తెడి దిపుడు నాకు
గుండె కొండయై పోయెను.

నీ సఖ్య బలమ్మె నాకు
నిజముగ కొండంత బలము
గూర్చెగాక వాలితోడ
కొట్లాడగ నా కౌనా?

రామా! రఘు రామా! రణ
రంగ భీమ! శ్రీరామా!
నీ సహాయమున వాలిని
నే సవాలు చేయగలను.

వాలిని బరి మార్చుట నా
వల్లకాదు భండనమున
పలు మారులు వాలిచేత
పరిభవింపబడి పారితి.

ఆలములో బలహీనుడ
నై పురి బయటికి పరుగున
నీ వైపే పారి వత్తు
నీ శరణ్యమే వేడుదు.

పారిపోవు వైరి నెపుడు
బరి మార్చగ వెంటాడుట
వాలికి నైజము గావున
వాడు నన్ను వెంటాడును.

కొండ నెక్కి యుండగ నీ
అండ జేరుదును రామా!
వెంటాడుచు వచ్చు వాలి
కంట బడును శ్రీరామా!

అపుడే నీవా వాలిని
హత మార్చుము రామా! నీ

శరణాగత రక్షణత్వ
మెరుగనిదా సుగుణధామ!

ఖర విరాధ రాక్షసులను
కడతేర్చిన రణభీమా!
నీ శౌర్య పరాక్రమాలు
నిరుప మానములు రామా!

అని సుగ్రీవుడు వ్యూహం
బొనరగ వివరించి రాఘ
వునకు నమస్కృతు లొనర్చి
రణోత్సాహియై వెడలెను.

## యుద్ధానికి పిలుపు

ఊరిబయట రామాదులు
ఉండిపోయిరొక వనమున
భాను సుతుడు పౌరుషమున
ప్రవేశించె పురములోన.

గడి ముందర నిలచి సింహ
గర్జన గావించినాడు
ఆ భీకర నాదానికి
ఆకాశము దద్దరిల్లె

అంత సహన రహితు డగుచు
అంతఃపురి నుండి వెడలి
ఇన సూనుని సింహనాద
మును విని కినుకను వహించి

ఆ క్షణమే రాహుగ్రస్తు
డగు సూర్యుని భంగి కాంతి
రహితుడగుచు వాలి మహా
రౌద్రముతో నెగ్రబడెను.

నేల పగిలి పోవునట్లు
వాలి పాద ఘట్టనముల
తో బయటికి వెడలి వచ్చి
దుందుడుకున దూకులిడుచు
తార యెంత వారించిన
తామసమున వినడయ్యెను.

అది రాత్రివేళ తు
మ్మెద కమల దళ బాహు
బంధనమ్ముల దేలి
పరవశించెడి వేళ!

మధు మత్తులోన మ
న్మథ కేళిలోన జం
భారి సూనుడు తార
బాహు పరిరంభముల
దేలి పోయెడి రాత్రి వేళ!
తూలి పోయెడి మధుర హేల!

రణమునకు రమ్మనుచు
రంకె వేయుచు పిలుచు
వైరి దుర్భర పరుష
వాక్యములు చెవినిబడ

పండ్లు పటపట కొరకి
పద ఘట్టనములతో
పగవాని ఉక్కణచ
బయట వెడలెను వాలి.

అంత అంతఃపురము
నందున్న స్త్రీ జనము
దిగులుతో బుగులుతో
దిగ్గురని సుడివదిలి.

తార భయపడి పోయి
ధవుని వాలిని కౌగి
లించుకొని ప్రియములొల
కించు చిట్లని పలికె—

## తార వారించుట

వరవీరా! నీ కోపము
వరద వోలె వచ్చిన దిపు
డీ కోపము వదలుము నీ
కిది శ్రేయస్కరము గాదు.

రాత్రి వేసుకొన్న మాల
ప్రాతఃకాలాన పార
వేయునట్లు నీ కోపము
విడిచి పెట్టు ప్రాణేశ్వర!

సుగ్రీవు డనేక సార్లు
నిగ్రహించలేక నిన్ను
రణము నుండి పారిపోయి
రణమున కిపుడేల వచ్చె!

ఎవరి అండనో గైకొని
ఇతడు నేడు గర్జించుచు
యుద్ధానికి పిలచినాడు
ఒక్కడుగా రాలేడిట!

ప్రభూ! నేను వింటిని మన
బాబు అంగదుడు చెప్పగ
చారులతో విన్నాడట
సంగతి వినిపింతు వినుము!

రామ లక్ష్మణులు శౌర్య ప
రాక్రమ శాలురు శత్రు భ
యంకరులగు వారల స్నే
హము చేసెను సుగ్రీవుడు.

వారి సహాయమున నిన్ను
వధియింపగ వచ్చినాడు
ఒక్కడుగా రాలేదిట
యుద్ధానికి పిలుచు వాడు

నాథా! నామాటవిని ర
ణమ్ము నేయ మాను కొనుము

సుగ్రీవుడు నీ తమ్ముడు
శూరుడు నీయంత వాడు.

నీ తమ్ముని కన్న నీకు
నిజముగ ఆత్మీయుడెవడు?
చిన్నవాడు సుగ్రీవుడు
మన్నింపం దగిన వాడు.

నీ తమ్ముని యువరాజుగ
నియమించుము తత్ క్షణమే
నీ ప్రక్కన నీ తమ్ముడు
నీకెంతో బలము గూర్చు.

సుగ్రీవునితో వైరము
చూడ మహా ప్రమాదమ్ము!
సుగ్రీవునితో స్నేహము
చూడ మహా ప్రమోదమ్ము!

కావున నీ పతనితోడ
కచ్చకిట్లు కలహించకు!
మంచిది కాదిది నాథా!
మరోలాగు మదినెంచకు!

అని చెప్పిన తార మాట
లను వినకను సుగ్రీవుని
తో యుద్ధము సేయుటకై
దూకులిడుచు వాలి వెడలె.

వాలికి కాలము మీరుచు
వచ్చుటచే తార వచిం
చిన మాటలు రుచియించక
రణమునకై బయట వెడలె.

ఓసి! పిరికిదానా! వా
డా సుగ్రీవుడు నాతో
పోరు సలిపి ఎన్నిసార్లు
పారిపోయె తెలుసు కదా!

ఎవరి అండచూచుకొన్నో
ఎదిరించగ వచ్చెనందు
వెవ్వడైన కాని నన్ను
ఎదిరించగ నిలువలేడు.

తారా! నీ వంతఃపుర
నారీ జనములతో లో
పలికి వెళ్లి పొమ్ము అడ్డు
పడకు నన్ను పోనిమ్మిక!

చానలతో గూడి తార
లోనికేగె దుఃఖించుచు
కాలము తన్నుక వచ్చుట
కదనానికి వాలి వెడలె!

## వాలి సుగ్రీవుల యుద్ధం

కోపముతో చెలరేగిన
కోడె త్రాడు బుసలు గొట్టు
విధమున పెను నిట్టూర్పులు
విడుచుచు పగవాని కొరకు
నగరినుండి వెడలి వచ్చి
నలు దిక్కులు చూచినాడు.

చక్కగ దట్టీ కట్టుక
సమరానికి సిద్ధముగా
ఉండిన సుగ్రీవుని గని
ఉగ్ర సింహుడై పోయెను.

తానుగూడ తొందరగా
దట్టిని గట్టుక పిడికిలి
బిగియించుక సుగ్రీవుని
పీచ మడచ నెదురేగెను.

అప్పుడు సుగ్రీవుడు రో
షాగ్ని కనుల చెలరేగగ
వేగముగా వాలి మీద
విక్రమించి పడబోయెను.

వాలి మరింతటి కోప
జ్వాలలతో మండి పడుచు
పిడికిలితో ఒక్కపోటు
పొడిచినాడు సుగ్రీవుని.

ఆ పోటుకు సుగ్రీవుడు
అల్లల్లాడుచు నెత్తురు
గ్రక్కుకొనెను కాని మళ్లి
గ్రక్కుననే తేరుకొనెను.

దెబ్బతిన్న సింగము వలె
దబ్బున ఒక మద్ది చెట్టు
నూడ బెరికి దానితోడ
ఊరక వాలిని బాదెను.

ఆ దెబ్బల కింద్రసుతుడు
అట్టిట్లయి సంభ్రమంలో

బరువుతో చలించునట్టి
పడవవోలె ప్రకంపించె.

ఒకరి కొకరుతీసిపోక
యుద్ధంబున గడిదేరిరి
గరుత్మంతు వేగముతో
గగన భాగమున కెగసిరి.

చంద్ర సూర్యులట్లు వారు
చండ యుద్ధ మొనరించిరి.
ఒకరి లోప మొకరు వెదకు
చుండిరి, విడువక పోరిరి.

అంత బల పరాక్రమాల
నధికుడైన వాలికొంత
తడవునకు బలంబు పెరుగ
తరణి సుతుని బలము తరిగె.

బలమున క్షీణించి వాలి
బలమి కోర్వ జాలక, సు
గ్రీవుడు భీతిల్లి పారి
పోవుటకై దిశలు చూచె.

రాముడున్న దిశకు పారి
రవి సూనుడు పరుగెత్తెను
పారువాని వెంటాడుచు
పరుగెత్తుచు వాలివచ్చె.

## వా లి వ ధ

రాముని సన్నిధి జేరగ
రవి సూనుడు సమీపించె
ఆర్తుడైన వానిమీద
ధూర్తుడు పడనేగుదెంచె.

రాముని పాదాల మీద
రవిసూనుడు పడవచ్చెను
వాని జంప నిద్రసుతుడు
హూనికతో వెంటాడెను.

ప్రాణ భయముతో వృషభము
పరుగెత్తుచు పారుచుండ
పట్టి చంప క్రూర మృగము
పైబడ వెన్నాడుచుండ.

"పరమేశా! జగదీశా!
శరణు! శరణు! రక్షింపుము!"
అని గోవల్లభుడు వేడు
కొన ప్రభు సన్నిధి జొచ్చెను.

అపుడా ఆర్తత్రాణ ప
రాయణుడా వృషభేంద్రుని
రక్షించెను, మృగాధముని
శిక్షించెను. ఈ దృశ్యము
స్వప్నమయ్యె రసప్రియుని
సందేహము విడిపోయెను.

శరణాగత రక్షా దీ
క్షా బద్ధుడు రాముడిల్లె
రక్షించెను సుగ్రీవుని-
శిక్షించెను వాలి నిల్లె-

వెంటాడుచు వచ్చు వాలి
కంటబడిన తత్క్షణమే
ఆర్తత్రాణ పరాయణు
డా రాముడు రణ భీముడు-

శరణాగత రక్షకుండు
సాధుజనోద్ధారకుండు
శత్రుభయంకరుడు దుష్ట
సంహారకుడా రాముడు.

"ఆగు ఆగు వాలీ! నీ
అసువులు కాపాడుకొనుము!"
అని అస్త్రము సంధించిన
యంతలోన వాలి సాల
వృక్షము నొకదాని బెరికి
వేసెను రఘురామునిపై-

రాముని బాణమ్ము దాని
రయమున ఖండించివైచి
రొమ్ములోన జొచ్చెను, వృ
క్షమ్మువోలె వాలి కూలె!

చాటున బాణము వేసిన
ఛాతీలో గ్రుచ్చుకొనున?
ఎదురు పడెను గాక బాణ
మెదలోపల గ్రుచ్చుకొనున?

ఆర్త రక్షణమ్ము సదా
ధర్మ సమ్మతమ్ముగదా!
శరణాగత రక్షణమ్ము
క్షాత్ర ధర్మమగును గదా!

మాటున బాణము వేసిన
మాట నమ్మనగునే గతి?
రసప్రియుని కలము నుండి
కుసుమించెను క్లిష్టకృతి!

## వాలి ఆరోపణ

రణ కర్కశుడైన వాలి
రామ బాణ తాడితుడై
కట్లు తెగిన ఇంద్రధ్వజ
మట్లు నేల కూలి పడెను.

తనపై బాణము వేసిన
ధర్మప్రండితుని నేర్పరి
తనము మెచ్చుకొనుచు నతని
కనులారగ చూడ నెంచి,

తేనెకనులు మెలమెల్లగ
తెరచి కొనుచు మూసి కొనుచు
మంటలారి నట్టి నిప్పు
మాదికి కనుపించె వాలి.

తనను సమీపించు నట్టి
ఇనకుల సోదరుల గాంచి
పరుషముగా వినయముగా
పలికె నిట్లు రామునితో.

"రాకుమార! ఒకరి తోడ
రణము సేయువాని మీద
బాణము వేయుట కొరకే
బాణవిద్య నేర్చితివా?

రాచకులములో జనించి
నీచపు పని చేసినావు
ఈ విధి నను వధయొనర్చి
ఏమి కీర్తి పొందినావు?

ఇనకులుడవు మనుకులుడవు
ఘన కీర్తి గడించినావు
దశరథ పుత్రుడవు సకల
ధర్మముల నెరింగినావు.

నీ రాజ్యము నీ భార్యను
నే(ముచ్చిలి చేసితినా?
చేసితి నీకేమి చేటు
చెప్పుము రఘునందనా!

చేతగాక రాజ్యము ని
చ్చితివి కైకసుతున కీవు.
సతి నెత్తుక పోయిన రా
క్షసుని వదలిపెట్టినావు.

దిక్కులేని సుగ్రీవుని
దిక్కు జేరినావు కాని
నా దగ్గరికే వచ్చిన
చో దశకంఠుని వధించి
నీ సీతను క్షణములోన
నీకు తెచ్చియిత్తు కదా!

నీకు నాకు వైరమేమి?
విస్ఫారణముగ నాపై
బాణము వేసితివి, ధను
ష్పాండిత్యము జూపితి విటు!

బాణ విద్య నేర్చినావు
పగ వానిని చంపుటకా?
పరుల నెవరిపైన గాని
ప్రాణాలను తీయుటకా?

కట్లుత్రెంచుకొని మదగజ
మెట్లు తారసిలిన వాళ్ల
చంపునో నీవట్లే నను
చంపినావుగద రామా!

యుక్తాయుక్తం బెరుగక
శక్తిమంతుడను నేనని
నిందిత మైనట్టి పరమ
నీచ కృత్య మొనరించితి
విక నిన్ని విషయములో
ఎవరైనా పెద్దలు ప్ర
శ్నించినచో నీవేమని
చెప్పెదువో చెప్పు రామ!"

ఇట్లు బాణ పీడితుడై
హెచ్చుగ మాట్లాడుటచే
నోరెండి ప్రయాస జెంది
ఊరకుండె నింద్రసుతుడు.

జలమంతయు కురిసి కురిసి
బలము తగ్గు మేఘము వలె
జ్వలియించి జ్వలించి పిదప
చల్లారిన అగ్నివోలె
దుర్బలు డైనట్టి వాలి
తో రాముడు పలికెనిట్లు–

## రాముని సమాధానము

ఓ కపివర! నీవిటు నా
పై కోపము సేయవలదు!
ఇలలో ధర్మార్థ కామ
ముల త్యజించ నీకు తగదు!

ప్రభువై దుర్బలునిపై దు
రాక్రమించుటది ధర్మమ?
జ్ఞాతికి సగ పాలివ్వని
నీతి నీకు పురుషార్థమ?

బలవంతముగా తమ్ముని
భార్యను చెరపట్టినావు!
కామాంధ్యములో కన్నులు
కానక చరియించి నావు!

పుట్టుగ్రుడ్డి వాడొక్కడు
పుట్టు గ్రుడ్డి వారలతో
చర్చించిన విధమున అ
జ్ఞానముతో మాట్లాడెదు.

తన తప్పును ఒప్పుకొన్న
తమ్ముని క్షమియించలేని
క్రూరాత్ముడవై చరించు
ఘోర మృగ ప్రాయుంతవు.

అహం వల్ల అంధుడవై
ఆత్మీయుని గాంచలేవు
స్వార్థముతో సమతలోని
సౌందర్యము చూడలేవు.

సహనమ్మది నీలోపల
దహనమ్మైపోవుటచే
సహజీవన బృందావని
గహనమ్ముగ మార్చినావు.

తోబుట్టువు సుఖాలనే
దోచుకున్న దురాత్ముడవు
కామాంధుడవై తమ్ముని
కాంతనే రమించినావు.

తమ సాంధుడవై తమ్ముని
తరిమి తరిమి కొట్టినావు
తమ్ముని కడతేర్చి అతని
సొమ్ము సొందనెంచినావు.

తమ్ముడనగ కొడుకు సమా
నమ్ముగదా అతని సతిని
కోడలిగా నెంచవైతి
కోతిబుద్ధి మానవైతి.

తోబుట్టువుతో కూతురు
తో తమ్ముని కులసతితో
చరియించెడి పాపాత్ముని
చంపడమే తగినశిక్ష.

అని ధర్మము చెప్పకదా
అన్ని నీకు తెలుసుకదా
తెలిసి చేసినట్టి పాప
మిల సహింప రానిది కద!

లోకాచారానికి వ్యతి
రేకముగా నడచువాని
చూచి ఊరకుండ లేదు
సుక్షత్రియుడైన వాడు.

సంఘానికి ధర్మానికి
శత్రువైన వాని జూచి
సుక్షత్రియుడైన వాడు
శిక్షించగ నుండ లేదు.

భరతుని పరిపాలనలో
ప్రతినిధియై ధర్మహాని
సేయునట్టి దుర్మార్గుని
శిక్షించుట నాధర్మము.

భరతుడు రాజ్యము చేసెడు
భరత ఖండమందు ధర్మ
హాని చేయునట్టి నిన్ను
హత మార్చుట నా ధర్మము.

ధర్మప్రతిష్ఠాపనమే
ధరణీశుని కర్తవ్యము

ధర్మమున్న ధరణిలోన
తన రారను సుఖశాంతులు.

ధర్మ రక్షణార్థము నిను
దండించితి కాన నీవు
చేసెడి నిందారోపణ
చెల్లదు నాయెడ నిజమిది!

క్రూర సర్పమింట జొరిన
ఊరకుందురా? దానిని
తత్‌క్షణమే చంపునట్లు
దండించితి నిన్నుగూడ.

వేదాలను పఠియించిన
విద్వత్కపి వరుడ వీవు
చదువు సంధ్యలవి నేర్చిన
సంస్కారము గలవాడవు.

ఎరిగి ఎరిగి ఇన్ని తప్పు
లేరీతిగ చేసినావు?
చూచి చూచి నిప్పునంట
చూచెదరా? ఎవ్వరైన!

ఫలియించని పక్షములో
తెలియకనే చేసితినని
ఫలియించిన పక్షములో
తెలిసి చేసితని కొందరు.

ధర్మ శాస్త్రములు తెలిసియు
దబ్బరలాడెడి వారలు
మూర్ఖాధము లుందురు ఓ
మర్కటమా! వాదాడకు.

మాయావిని చంపి నీవు
మరలి వచ్చినపుడు నిన్ను
నీ తమ్ముడు వినయముగా
నీరాజ్యము గైకొను మని
ప్రార్థించెను, పౌరపాటుకు
పరిస్థితులు వివరించెను.

క్రోధము మోహము నీలో
కొడిగట్టుక పోవుటచే
తమ్ముడెంత వేడుకొన్న
తామసమున వాని తరిమి

కొట్టి వాని సర్వస్వము
కొల్లగొట్టుకొని నీ పశు
బలమున కెదురే లేదని
బలాత్కారముగ నాతని
కులసతినే చెరచినట్టి
ఘోరకర్ముడవు కుమతివి.

పరమ భీతితో తమ్ముడు
పరువెత్తుచు నున్నప్పుడు
ఋష్యమూక మెక్కుదాక
మృగమై వెన్నాడినావు.

విష సర్పమునెట్లు చంప
విధియగునో అట్లే నిను
చంపుట నావిధి గావున
చంపితి నిప్పి విధమున.

## వాలి పశ్చాత్తాపము

ధర్మములో సూక్ష్మమెల్ల
దశరథ తనయుడు చెప్పగ
తన తప్పులెరింగి ఒప్పు
కొని పశ్చాత్తాప పడుచు.

చేతులు జోడించి కనులు
చెమ్మగిల్ల కంఠములో
గద్గదికము గదుర బలికె
కపి నాథుడు రామునితో

దశరథ నందన! విలసత్
ధర్మజ్ఞాన విధానా!
నా కన్నులు తెరిపించిన
నలినపత్ర నయనా!

నీ ధార్మిక వచనామృత
నీరధిలో స్నానమాడి
కామాగ్రహ మాలిన్య
శాళన మొనరించు కొంటి.

నిన్ను జూడ గంటి నిపుడె
నీ కృప గను గొంటి నిపుడె
అఖిల సౌఖ్య పదవులంది
అమరత్వము పొందుచుంటి.

నన్ను కరుణ జూచిన ఓ
నరవర! నారాయణా!

నా కన్నులు తెరిపించిన
లోకావన! పావనా!

కామాంధుడనై తమ్ముని
కాంతను చెరచితిని దురా
చారుడ నీచుడ నను గని
సంఘమెంత యేవగించు!

స్వార్థంతో కనులు గప్పి
సహోదరుని తరిమి తరిమి
కొట్టితి తిట్టితి నెట్టితి
క్రూరుడనై చరియించితి.

పాపిష్ఠిని కోపిష్టిని
పశ్చాత్తాపాగ్నిలోన
పరితపించు చుంటి నన్ను
దరిజేర్చుము నా స్వామీ!

ధర్మము వదలిన వాడను
ధర్మజ్ఞా! దయతో నను
క్షమియింపుము నా పాపము
శమియింపుము కాపాడుము.

నాకు నేను హతుడనైతి.
వ్యాకుల పడనెంతమాత్ర
మిది స్వయం కృతాపరాధ
మిందుకు నేనే బాధ్యుడ!

నా గురించి తారగూర్చి
నా బంధు జనాల గూర్చి
చింత లేదు కానీ నా
చిన్నారి కుమారుడైన
అంగదుని గురించి నాకు
ఆత్మక్షోభగ నున్నది.

కన్ననాటి నుండి వాడు
గారాముగ పెరిగినాడు
నేను మరణమొందినాక
దీనుడు కాకూడదు వాడు.

సుగ్రీవుని చూచినట్లు
చూడుము అంగదుని గూడ
భరత లక్ష్మణుల మాదిరి
ఇరువుర నొక దృష్టి జూడు.

వినయముగా వాలి యిట్లు
విన్నవించుకొన్న పిదప
ఊరకుండె నంత ప్రియము
గా రాముడు బదులాడెను.

"వాలీ! అంగదుని గూర్చి
వలదు నీకు పరితాపము
నేనును సుగ్రీవుడు నీ
సూనుని అంగదుని భూతి
వాత్సల్యముతో చూతుము
వలదు వలదు! సందేహము!

ఇంకను విను వాలీ! నీ
కీ నాటికి ప్రాయశ్చి
త్తము రూపములో నీ పా
పము లన్నియు సమసిపోయె!

దండ్యుడు దండింప బడుట
ధర్మ సమ్మతము గావున
అపరాధము పరిహారం
బగుట నీకు ముక్తి గలిగె!

నీవిక చింతించ వలదు!
నీవు ముక్తి కాంతతోడ
పరసుఖముల ననుభవించి
తరియింతువు చింతించకు".

అను చల్లని తియ్యని రా
ముని మాటలు విన్నంతనె
సంతృప్తిని జెంది వాలి
శ్వాసను కడసారి బీల్చె!

## వాలి అంతిమ ఘడియలు

అవసాన కాలమున
అంగదుని దగ్గరకు
బిలచుకొని గుండియలు
పిండునట్టిట్లనియె!

"నాయనా! సీకు చి
న్నాయనే నాయనిక
అతడు చెప్పిన యట్లు
ఆచరించగ వలయు!

నా యెడల నీ వెట్లు
నడచు కొంటివా యట్లె
అతని యెడ నీ వట్లు
అనుసరించగ వలయు.

స్నేహమతిగా నుంట
స్నేహమే లేకుంట
ఇవి రెండు వలదు మ
ధ్య విధానమున నుండు.

సుగ్రీవు పై పునకు
చూచి దగ్గరకు ర
మ్మని పిలచి వాలి యి
ట్లని బలికె జాలిగా-

"తమ్ముడా! సుగ్రీవ!
దైవ వశమున నన్ను
వ్యామోహ మది పట్టి
అఘములను చేయించె.

మన కిద్దరికి కలిసి
మన గలుగుటకు వ్రాసి

పెట్టి కుండుట ఇట్టి
పెడదారి పట్టితివి.

నిను వెడల గొట్టితవి
నీ భార్యను హరించి
తని దోషమెంచకుము
అనుజ! నను మన్నించు!

నా ప్రాణముల కన్న
నా కధికుడగు అంగ
దుని ప్రేమతో జూచు
కొనుము నీ కొడుకట్లు!

ఈ హేమమాల గొను
మిది దివిజ విభుప్రసా
దితము దీని ధరించి
తేజరిల్లుము నీవు!"

వాలి యిట్లని బాణ
బాధ కోర్వగ లేక
విలవిలా కొట్టుకొని
విడిచె ప్రాణమ్ములను.

## సుగ్రీవుని పరితాపము

అంతగొల్లున ఏడ్చె
రంగదుడు తారయును,
అపుడు సుగ్రీవుడ
త్యంత దుఃఖముజెంది
తనసోదరుని చంపు
కొంటినని పరితాప
మును జెంది రామ భ
ద్రుని తోడ నిట్లనియె!

"రామచంద్రా! నాకు
రాజ్యమేటికి అన్న
నే చంపు కొన్నట్టి
నీచుడను దుష్టుడను.

ఇక పొమ్ము! నిను చంప
నిక రాకు యుద్ధమున"
కని చెప్పి వదలు చుం
డెను వధింపక నన్ను!

ఆతని తోబుట్టువన
మతని ధర్మగుణంబ
దెంత గొప్పది దాని
కింత పని చేసితిని!

తగని పని చేసితివి
వగచి ఫలమే మింక
అన్ననే చంపించి
నట్టి పాపాత్ముఁడను.

ఋష్యమూకము మీద
నే యుండి పోయెదను
భ్రాతృ హంతకుఁడ నా
పాపాని కిది శిక్ష!

భ్రాతృవధచే మహా
పాపమొనరించితిని
రాజ్యార్థి తలఁ నాకు
పూజ్యమై పోయెనిక!

ప్రజలచే సమ్మాన
భాగ్యమందగలేను

రాజునై క్షణమైన
రాజ్య మేలఁగలేను.

త్వష్టృ పుత్రుని చంపి
బ్రహ్మ హత్యాపాప
మును బొంది నట్టి ఇం
ద్రుని వోలె భ్రాతృ హ
త్యా మహా పాప కా
ర్యము చేసి నానకట!

అతడు దివిజ విభుండు
అతడు వరము లొసంగు
నని మహీరుహ మహీ
వని తాంబువులు వాని
పాపముల గొనిరి నా
పాపమెవరు గ్రహింత్రు?

ఇనకులజ! వన్నెమా
సిన సువర్ణము పుటము
పెట్టి నప్పుడు దాని
పెనుమైల నశియించి

మేల్మి బంగారమది
మిగిలిపోవును గాని
సంతాప వహ్నిలో
సద్వ్యక్తి కాసంత
నాలోన గలది అది
నాశనం బయి పోయె!
ఇక మహా పాపమే మిగిలె!
ఎదలోన శోకాగ్ని రగిలె!

## ఏది వైరాగ్యం

ఒక వైపు సుగ్రీవు
డొక వంక తారాంగ
దులు గోడు గోడుమని
దుఃఖిచు చుండగా–

కనులలో గిరగిరా
కన్నీరు గ్రమ్ము కొన
రాము డార్తుల దగ్గ
రకు జేరి ఓదార్చె!

"శోక పరితాపమున
చేకూరదెంత మా
త్రము మృతునకేమంచి,
తగదు దుఃఖిచగా–

మృతుల కేదియొనర్చ
శ్రేయమో ఇపుడట్టి
అపరకర్మలొనర్చ
టది అవశ్యము మీకు!

ఈ ప్రపంచములోన
ఏ కార్యమున కెవరు
కర్తగారు. సమస్త
కార్యములు విధివశము.

విధికి చుట్టరికంబు
పిసరంతయును లేదు
మిత్రత్వమును లేదు
శత్రుత్వమును లేదు.

ఎవరి కర్మను బట్టి
ఏమి సంభవమైన

విధి ఫలముగా ననుభ
వించవలె నద్దాని.

విధిని మించగలేరు
విధి స్వతంత్రుడు, విధియె
కారణము, విధికేది
కారణముగా లేదు.

విధియనగ కాలమని
విధియనగ ప్రాప్తమని
విధియనగ దేవుడని
విబుధులందురు గాన
విధి ప్రసాదితమైన ఫలము!
విధిగ ననుభవ మొందగలము!

వాలి నాచే చంప
బడె, విధి ప్రేరణము
కారణము గాగ దుః
ఖము వదలు సుగ్రీవ!

మోహమున క్రోధమున
మూర్ఖుడై క్రూరుడై

తగని పనుల నొనర్చి
దండింప బడుట ప్రా
యశ్చిత్తమొంది శు
ద్ధాత్మ డయ్యెనువాలి.

కామప్రలోభాలు
కవ్వించి నీది కా
నట్టి దానిని పొంది
నందులకు కష్టాలు
పడితివిక నీదోష
పరిహారమై పోయె!

ఋణ భారమది తీర్చు
కొనిన చందము మీర
లెవరి కర్మలు వార
లీ విధముగా ననుభ
వించితిరి నీవు దుః
ఖించకో సుగ్రీవ!"

రాముడీ విధిని వై
రాగ్యముపదేశించి

ఓదార్చ సుగ్రీవు
డూరడిలి నిట్టూర్చె!

అంత లక్ష్మణుడు విన
యంబుగా నిట్లనియె-
సుగ్రీవ! నీ విపుడు
శోకించు అంగదుని
ఓదార్చి ప్రేత కా
ర్యోన్ముఖుని జేయవలె.

ప్రకృతమున ప్రేతకా
ర్యముల వాలికి జేయ
వలయు జావ్యము సేయ
వలదిట్టి పనులందు.

అని చెప్పినంతనే
ఆలసించక శిబిక
గొనితెచ్చి వాలి నం
దున బెట్టి మోసికొని
కపి వరులు మరుభూమి
కపు డరిగినారు!

దహన సంస్కారాలు
తగ జేసినారు!

వాలి ఉత్తర క్రియలు
వానరులు గావించి
రా పిదప హనుమ రా
మన్నతో నిట్లనియె—

## సుగ్రీవుని పట్టాభిషేకం

శ్రీరామ! మీ దయా
శ్రీ విశేషము వలన
కపిరాజ్యమును పొంద
గలిగె మా సుగ్రీవు
డిక మీరు నగరమున
కేతెంచి పట్టాభి
షేక మతనికి ప్రీతి
జేయగా వలయు!
అతని సమ్మానాల
నందు కొన వలయు!

అంత రఘువరు డిట్టు
లని పలికె. "ఓ హనుమ!
పదు నాల్గు వర్షములు
పరిసమాప్తము కాక
పురములోనికి నేను
పోరాదు గాన మీ
రలు యథాశాస్త్రముగ
రవిసూను రాజుగా
అభిషిక్తు జేయవలె!
అంగదుని యౌవ రా
జుగ జేయవలె! ఇదియె
శుభదాయకము మీకు"!

ఇవ్విధంబున బలికి
ఇనవంశదీపకుడు
సుగ్రీవునిం జూచి
సూక్ష్మముగ నిట్లనియె!—

## కార్తీకం సంకేతం

"ఇక వినుము సుగ్రీవ!
ఇది వాన కాల మిది
శ్రావణము, నాల్గు మా
సము లింక గడువ వలె!

కార్తీక మది మొదలు
గాగ రావణ వధా
ర్థము ప్రయత్నము సేయ
దగు తప్ప దిది నీకు.

ఇది మనకు సంకేత
మిది మరచిపోకుమా!
మిత్రమా! నీ కార్య
మే మిగిలినది సుమా!

ఇకనీవు నీ పురము
నకు పొమ్ము పట్టాభి
షేక మొనరించు కొని
చెలువార సుఖియించు!

అంగదుని యౌవ రా
జ్యము నందు పట్టాభి
షేకంబు చేయవలె!
శ్రేయమిది నీ కెపుడు!"

పురములోన సుగ్రీవుడు
భోగంబుల ననుభవించు
చును కిష్కింధా రాజ్యము
నొనరగ పాలించసాగె!

పురము బైట శ్రీరాముడు
గిరిపై నొక గుహలోపల
తమ్మునితో వర్షా కా
లమ్మెల్లో గడుప దొడగె!

***



వాలివధ విధానంలో చాటు దెబ్బను సమర్థించే వాలిసుగ్రీవుల మొదటి పోరును, గజపుష్పమాలను గురించి చెప్పటం మానివేశాను. కొట్టింది చాటుదెబ్బ కాదని ఎదురుదెబ్బే అని రసౌచిత్యాల కోసం మలుపు చేశాను.

—రసప్రియ

# సీతాన్వేషణ

## వర్షర్తువు

అంబర మందంత పర్వ
తాకారము లేర్పడినవి
కదలలేని గర్భవతుల
కరణి దోచు మేఘములవి.

ఆకాశము కార్తీకా
ద్యాషాఢము పర్యంతము
రవికిరణాలకు పయోధి
రసముగ్రోలి తొమ్మిది మా
సములు మోసి సకల రసా
స్పద జలముల ప్రసవించును.

వేదాధ్యయనమ్ము సేయ
విప్రవరు లుపక్రమింత్రు
భాద్రపదమునందు హస్త
ప్రాప్తించిన సమయమందు.

ఎండకు మిక్కిలి కాగిన
ఈ భూమి తపించి దుఃఖ
మున తపించు సీతవోలె
పొగులు చున్న యట్లున్నది.

మేఘము నందున చలించు
మెఱుపు రావణుని తొడపై
పెనుగు లాడు సీతవోలె
కనుపించెడి యట్లున్నది.

దుమ్మణిగెను భూమి మీద
తెమ్మెర చల్లగ వీచెను
మండు టెంత ఉపశమించె!
దండయాత్ర లాగిపోయె!

పరిపూర్ణత జెందినట్టి
పురుషులు నమ్రులు గారే
యను చందము మేఘము లమృ
తాంబువుతో వంగివచ్చె.

ఆవులెదకు వచ్చెనదిగో!
ఆబోతులు రెచ్చెనదిగో!

నదులు పరుగు లెత్తుచు జల
నిధిని చేరఁబోయె నదిగొ!
స్త్రీలు కామ పరవశలై
చేరిరి తమ ప్రియుల నదిగొ!

సురత కేళిలో దెగిపడు
సురాంగనల మౌక్తిక హా
రాల వోలె జలధారలు
రమణీయంబై యొప్పెను.

వెనుక నుంచి వినిపించెడి
ఘన గర్జన కెదిరి ఏను
గను కొని ఒక మదపు టేన్గు
వెనుక మళ్లె పోట్లాటకు.

వాన వెలసి తెల్లబడిన
వారిదములు సంధ్యారా
గమువ నడుమ నెఱ్ఱగ అం
త్యమున తెల్లగా నుండుట-
ఆకాశానికి గాయా
లై తెల్లని గుడ్డలతో

కట్లు కట్టి నట్లున్నది
కట్లు విప్పు గడువున్నది.

అక్కడక్కడ కొండలుండి
అలలులేని జలధి వోలె
ఒకచో వెల్లడిగావే
రొకచో ప్రచ్ఛన్నముగా
అగుపించును ఆకాశము
అడ్డంకులు అనివార్యము.

నింగి పిల్లగాలులతో
నిట్టూర్పులు విడుచుచు సం
ధ్యారాగముతో చందన
మలదు కొనుచు వారిదముల
వెల్లదనము గలిగి ప్రియా
విరహ తప్తవలె నున్నది.

లోకేశుని శోకానికి
లోకమెల్ల శోకించునా!
యనగ చిమ్మ చీకటిలో
అంబుదములు గురియుచుండె.

చెలువమొప్పగ లేత పచ్చిక
మొలచి యున్నది మధ్య మధ్యన
చిత్రముగ ఆరుద్ర పురుగులు
చెన్ను మీరగ మెరయు చున్నవి.

ఎఱ్ఱ చుక్కల చిలక పచ్చని
ఎంత చక్కని చీర గట్టెను
వర్షఋతువున సొగసు మీరగ
వసుధవధు కులుకు చున్నది.

వర్షధారలు కడిగి వేసిన
పర్వతోన్నత శిఖరములు నెల
వర్లతో విలసిలుట ముక్తా
హారములతో నలరు స్వచ్ఛో
న్నతముపై మదియించి మించిన
నవవధూ స్తనములుగ వెలసెను.

పాత గట్లను ముంచి వేయుచు
పైకి తేలిన జక్కువలతో
పండ్ల తోడను పూలతోడను
పతి సముద్రుని జేర బోయెడి

నదుల జూచిన యౌవనోన్మద
మదముచే విలసిల్లు యువతులు
కట్టు బాట్లను లెక్కచేయక
ఘన కుచంబుల తోడ కులుకుచు
భోగద్రవ్యములన్ని గొని సం
భోగ కేళికి పరుగు లెత్తుచు
పెద్దలను లెక్కించ కుండగ
ప్రియుల దగ్గర కేగు చున్నవి.

పొన్న పువ్వులు మడ్డిపువ్వులు
పూలవెన్నో రకరకమ్ములు
గమ్ము గమ్మని మధువు వాసన
చిమ్ము చుండగ తూలి పోవుచు
ఝుమ్ము ఝుమ్మని తుమ్మెదలు మధు
రమ్ముగా గానమ్ము సేయగ—

మదముతో మత్తెక్కి స్వేచ్ఛగ
మయూరమ్ములు, నాట్యమాడగ
క్రొత్త నీరే మధువు కాగా
మత్తులో తందాన లాడెడు

త్రాగు బోతుల పానశాలగ
తనరు చున్నది కాననమ్మది.

ఝుమ్మని తుమ్మెద రొదయే
కమ్మని తంత్రీ ధ్వనిగా
కప్పల బెకబెక రవళులు
కర తాళంబులుగ మేఘ
గర్జనలే మృదంగాలు
గా మ్రోయగ అడవిలోన
పాట కచేరీలు జరుగు
పగిది దోచు చున్నదహహా!

"సూర్యుడు కనుపడుట లేదు
చుక్కలు కనుపడుట లేదు
ఇది పగలా! ఇది రేయా!
ఇది తెలియ రాకున్నది.

జాజిపువ్వు వికసించెనొ!
జలజంబులు ముకుళించెనొ
పక్షులు గూళ్ళకు చేరెనొ!
పరికించగ రాకున్నది.

అకాశము మేఘావృత
మై యున్నది. దిశలు తెలియ
కున్నవి, నిశలవని యలము
కొన్నవి, ఈ భూమి యంత
జలమయమై నిండి మార్గ
ములు దెలియక రాకున్నవి.

నా దుఃఖము దుస్సహమ్ము
నా శత్రు వసాధ్యుడయ్యె
గడచునెట్లు వర్షర్తువు?
కట కట! ఈ మూడింటిని
దాటుట నాకే మాత్రము
తరముగాని యట్లున్నది.

రాజ్యము పోయెను సీతను
రాక్షసు డెత్తుక పోయెను
నా స్థితి ఇపుడెంచి చూడ
నదీ ప్రవాహాని కకట!
కూలిపడే ఒడ్డులాగ
గుండె జారు నట్లున్నది.

ఇది వర్షాకాలము ఇపు
డేమి పనులు సేయరాదు
దండయాత్ర కనువుగాదు
దారి తెలియ రాకున్నది.

సీతాన్వేషణకై మన
స్నేహితుడా సుగ్రీవుడు
యత్నించెద నన్నను నే
నంగీకృతి సేయలేదు.

మన కార్యము బృహత్తరము
మార్గములా కానరావు
అది గాకను సుగ్రీవుడు
అమితముగా కష్టాలను
అనుభవించి ఇన్నాళ్ళకు
తన భార్యను కలిసి కొనియె—

అని వర్షాకాలమంత
అనుభవించనీ సుఖముల
నని నేనే చెప్పినాడ
అదను కెదురు చూచువాడ!"

అని రాముడు చెప్పినంత
అనుజు డీట్లు బదులు వలికె.

"అన్నా! నీవేమాత్రము
అధైర్యమును జెందవలదు
సుగ్రీవుడు కృతజ్ఞుండు
శుభలక్షణ శోభితుండు
అతడు మాట తప్పడెపుడు
అవని సుతను వెదకించును.

రావణుని వధింతువు నీ
రాము సీత దొరుకు నిజము
ఇది నిజమ్మ ఇది నిజమ్మ!
ఇది నిజమ్మ ఇది నిజమ్మ

ఈ వర్షా కాలము నీ
వేలాగో ఓర్చుకొనుము!
శరత్కాలమది రాగనె
శత్రువును వధించ గలవు"

తమ్ముని ధైర్యోక్తులువిని
దాశరథికి మనసు కుదుట
పడెను కాని సీతే కన
బడెను మనో నేత్రాలకు.

వర్షర్తువు గడుచుటెపుడు
వచ్చు నెపుడు శరదృతువది
ఇల తనయను వెదకబోవు
టింకెప్పుడు ఇంకెప్పుడు?

అని రాముడు సీత కొరకు
ఆహారహమ్ము విలపించెను
నాల్గు మాసములు నాల్గు యు
గాలుగ నెట్లో గడిచెను.

వెళ్ళలేక వెళ్ళలేక
వెళ్ళె నెట్లొ వర్షర్తువు
ఎదురు చూచు చున్న శర
దృతువది రానే వచ్చెను.

కష్టాలకు కాళ్లుండవు
కఠినుడైన విధికి గూడ
కట్టు బాట్లు గలవు వాని
దట్టు కొనుటె కావలయును.

# హనుమంతుని హితోక్తి

తన యభీష్టయగు తారను
తన ప్రియురాలగు భార్యను
పొంది నిరంతరము సుఖం
బుల నొందుచు సుగ్రీవుడు
శరదృతువది వచ్చిన తన
సఖుడు జ్ఞప్తి రాక పోయె!
తమ చేసిన వాగ్దానము
తలపునకే రాకపోయె!

మంత్రులపై రాజ్యభార
మంత మనిచి చింతలేక
అహోరాత్రములు కాముకు
డై మదనోన్మాదములో
కామినీ జనంబులతో
కాలము తెలియక గడుపుచు
కర్తవ్యము మరచినాడు
కపినాథుడు సుగ్రీవుడు.

హనుమంతుడు గుణవంతుడు
అదిగ్రహించి సుగ్రీవుని
సమీపించి హితోక్తులను
సవినయముగ విన్నవించె.

"కపినాథా! సుగ్రీవా!
కాలాతీతంబయ్యేను
శరదృతువది వచ్చె మిత్ర
సంకేతము మరచితివా?

నీ రాజ్యము నిష్కంటక
మై రహిల్లె ఇక మిత్రుని
కార్యము నెరవేర్చవలయు
కాలము మించక ముందే.

సమయములో స్నేహితునకు
సాయము చేసిన వాడే
నిజమైన స్నేహితుడని
నిఖిల జగము చాటునుగద!

మును ముందగ నీ కార్య
మ్మును నెరవేర్చిన మిత్రుడు

అతని కార్యమిపుడు నీవు
ఆలస్యము చేయరాదు.

కాలమెరిగి రాముడు తన
కార్యమునకు కబురంపడు
నిన్ను పరీక్షించు చుండె
నీవిక జాప్యము సేయకు!

కోటిన్నర కధికముగా
మేటి కపులు నీ వశమై
యున్నారిక నీ వాజ్ఞల
నొసగ వలయు తలదాల్తురు".

కాలమెరిగి సుగ్రీవుని
మేలెరింగి హనుమంతుడు
చెప్పిన విషయము గ్రహించి
చప్పున నీలుని బిలచెను.

"సేనా నాయకుడా! నా
సైన్యమంత రప్పింపుము
సీతాన్వేషణ కొరకై
శీఘ్రమె ఆజ్ఞాపింపుము!

పదునైదు దినాల గడువు
పిదప నిచటి కెవడు రాడో
వానికి దండన మరణము
దీనికి తిరుగే లేదను."

అని ఇట్లు 'వ్యవస్థ' నొనర
అర్కసుతుడు గావించెను
వ్యవస్థ జరుగ కుండిన కా
ర్యములు వ్యర్థమగును గాదె!

## శ ర దృ తు వు

శరదృతువది వచ్చెను అం
బరము నిర్మలంబై రా
త్రులు వెన్నెల వెండి పూత
వలె విరిసెను సుధ కురిసెను.

నల్లగలువ రేకులవలె
నల్లని మబ్బులు దశదిశ
లెగసి ఇపుడు మదము విడిన
ఏనుగులవలె శాంతిల్లెను.

పడుచులు తొలిరేయి సిగ్గు
పడి పెరుదులు కొలది కొలది
బయలు పడుచునట్లు నదులు
బయల్పరచె సైకతముల.

ప్రవహించెడి నదులందున
బలిసిన ఆబోతులందు
మదపుటేనుగుల యందు శ
రదృతువు తన సిరులు పంచె.

ఆకాశము మేఘ రహిత
మై తోమిన శస్త్రమట్లు
స్వచ్ఛముగా ప్రకాశించె
శరదృతు వెంతో శుద్ధము.

పెద్ద పెద్ద వానలచే
శుద్ధముగా కడుగబడిన
పలు రంగుల గిరిసానువు
లలరె నలుగు పూసినట్లు.

వరిధాన్యములను దిని బె
గ్గురు పక్షులు జాలుగట్టి

ఎగిరె పైకి పూలదండ
తెగిరె గాలి కాకసమున

బంగరు పువ్వుల బరువుకు
వంగి సువాసనలు జిమ్మ
వేగిస చెట్లడవి మధ్య
వెలిగించెను దీపాలను.

నల్ల కలువరేకులవలె
నల్లని మేఘాలు దిశల
నలుపు చేసి చేసి ఇపుడు
వెలరె వినుదగజములట్లు

దేన్గులు పెనిమిటియెడ
అనురాగము గలవైమ
న్మథ తీవ్రతచే మదనో
న్మాదముతో చుట్టుకొనియె.

చంద్రుడు ముఖమై చుక్కలు
చక్షువులై వెన్నెల తె
ల్లని చీరగ గట్టు కొన్న
వనితవోలె దోచురాత్రి.

ఆలమందలో క్రొవ్విన
ఆబోతులు కాలుదువ్వి
దుమ్ము చేసి కొని పరస్ప
రమ్ము పోర నుద్యమించు.

ప్రియుని కరస్పర్శ చేత
ప్రియెరాలను రాగముతో
కను గీటుచు తనకుతానె
కట్టు చీర విప్పినట్లు
చంద్రుని కిరణాలు సోకి
చక చక చుక్కలు మెరయగ
వెలవెల సంధ్యారాగము
తొలగె నంబరము స్వయముగ
శరదృతువది మనోహరము!
జగమంతా రాగమయము!

అహో! విరగ బూసి గాలి
కల్లాడే తెల్లుతో న
దీ తీరములవి ఉతికిన
తెల్ల పట్టు చీరగట్టి

కులికెడి స్త్రీజఘనముల
ట్లలరారుచు నుండెడు శర
దృతువెంతో మనోహరము!
బ్రతుకంతా రాగ మయము!

రాత్రియంత ప్రియులతోడ
రతి కేళుల యలసియున్న
అంగనలు ప్రభాత కాల
మందు మంద మందముగా
నడువలేక నడువలేక
నడచి పోవునట్లుగ చే
పలు ఒడ్డాణంబులుగా
గల నదులని మెల మెల్లగ
పారుచున్నవదిగో సిం
గారముగా భారముగా
శరదృతువది మనోహరము!
జగమంతా రాగమయము!

కలహంసాకుల మేఖల
కమలోత్పల శోభితమై
నడబావులు ఉత్తమాంగ
నలవలె శోభిల్లెను, శర

దృతు వెంతో మనోహరము!
బ్రతుకంతా రాగమయము!

వేణువ గాలులు వెదుళ్ల
వెడలి వచ్చు మధురధ్వని
తో గోవులు దూడలకై
దూడలు గోమాతలకై
'అంబా' యను అరుపులతో
ఆబోతుల రంకెలతో
ఆడవాండ్రు పెరుగు చిలుకు
నట్టి రవళితో ప్రభాత
వాయువులవి వీచుటచే
వసుధయంత వ్యాపించుచు
ఒక దానికి ఒకటి కలసి
ఓహో! యను పించు నట్టి
సంగీతము వినిపించును
సాహిత్యము తనియించును
శరదృతువది మనోహరము!
జగమంతా రాగమయము!
బ్రతికి చెడిన వాళ్లు మ చెడి
బ్రతికిన వాళ్లెగ్గు పరుచ

దీనులగుచు నెదురాడక
మౌనమూని సైచినట్లు
శరత్కాల గర్వముచే
మరాళాలు బెదిరించగ
పింఛములూడిన నెమళ్లు
పేద మొగము బెట్టుకొనియె!

చక్రవాక పక్షులతో
జలతారుల నాచులతో
రెల్లుపూలతో రేవులు
తెల్లటి వలువలను గప్పు
కొన్న స్త్రీల ముఖాలట్లు
చెన్నారుచు గనిపించును
శరదృతువది మనోహరము!
జగమంతా రాగమయము!

ఎండగానె భూమి బురద
లెండిపోయి నెర్రెలు పడె
రాజులిపుడు తమ తమ వై
రములు కారణములు గాగ
ఒకరి నొకరు జయించుటకు
యుద్ధానికి సిద్ధమైరి.

## రావణుని హెచ్చరిక

వర్షర్తువునందు బయ
ల్పడక బిలములందు దాగి
ఆహారము లేక చిక్కి
నట్టి ఘోర సర్పంబులు
బిలములనుండీ ఋతువున
వెడలివచ్చు బిల బిల మని.

ఒకరిపైన నొకరు వైర
మూని ఒకరి నొకరు జయిం
పగ రాజులు యుద్ధము సే
యగ యత్నము సేతురిపుడు.

చక్రవాకి తన భర్తను
జంట విడక వచ్చినట్లు
నా వెంట నరణ్యమునకు
నడచి వచ్చినది జానకి

వైదేహిని జారకుండ
వర్షపు మాసములు నాల్గు

నూరేండ్లయినట్లు ఎట్లో
భారముగా గడిపినాడ!

రాజ్యభ్రష్టుడనై దా
ర్భాగ్యుడనై ఇంటినుండి
తరిమి కొట్టబడి భార్యను
దనుజుడెత్తుకొని పోగా
పరమ దుఃఖితుడనగు, వా
నర రాజుకు సుగ్రీవున
కింకాదయ రాకున్నది
ఏమందును సౌమిత్రీ!

దిక్కులేని వాడ ననుచు
దీనుడనై తనదు శరణు
జొచ్చితినని సుగ్రీవుడు
చులకనగా జూచునన్నె!

శరత్కాల సంకేతము
మరచినాడు తన కార్యము
నెరవేరె నికేమి యనుచు
నిర్లక్ష్యము చేయుచుండె.

కిష్కింధకు పోయినీవు
ముష్కరాధముని సుగ్రీ
వునితోనే చెప్పినట్లు
అనుమిట్లని లక్ష్మణా!

ఉపకారమును పొంది
ఉపకారినే మరచు
నట్టి వాడవని పురు
షాధమాధము డనుము.

స్నేహితులచే పనులు
చేయించు కొని పిదప
స్నేహితులు కష్టాల
చే బాధ పడు నాడు.
వారలకు ప్రతిగ నుప
కారమును గావించ
కుండునట్టి కృతఘ్ను
డుండె నేనియు బుధులు
వాని పై పను జూడ
నైన జాదరు గదా

చచ్చెనేనియు వాని
శవము కుక్కలు గూడ
ముట్టనైనను ముట్ట వనుము!
మూర్ఖునకు దెలియునట్లనుము!

అరి భయంకరుడ వీ
వండగా నా కుంటి
వని యెరుగు ప్రతి హాతం
బగు నా పరాక్రమం
బెరుగు, అదికాక మన
మెందులకు అతని స్నే
హము చేసితిమి? ఆతని
అగ్రజుండగు వాలి
నెందులకు చంపితిమి?
ఎందులకు? ఎందులకు?

ఇది ఎరుగడా వాడు
ఇలసుతను వెదకుటకు
కద! తీర తన కార్య
మది తీరగానె ఒ
ప్పందమును మరచి నా
డెందులకు? ఎందులకు?

పోరునందున నేను
నారి సారించు నెడ
మెరుపు మెరసిన యట్లు
ఉరుము లురిమిన యట్లు
నా ధనుర్జ్యాణ టం
కారావముల వినం
గనొ? లేక నా పరా
క్రమము మరల పరీక్ష
సేయగా మన సయ్యె
నో యడిగితని చెప్పు!

వాలి పోయిన యమ
ద్వారమది తెరచియే
యున్నదింకను నీవు
ఒప్పందమును మరచి
వాలి జూడగ బోదు
వా? లేక వాగ్దాన
మును పూర్తిచేతువా?
అని మూర్ఖునకు జెప్పు!

వాన కాలము దాట
గానె సీతను వెదకు
తానన్న వాడిపుడు
తరుణమది దాటినను
గడువు మాసైన ఎ
త్తడు వాడు తాగి తం
దాన లాడుచు సుఖా
స్వానమాడుచు స్త్రీల
తో గూడి మైమరచి
దుఃఖమున మన్నామన
వైపు చూడదు కల్లు
కైపుతో వానరుడు.

ఇంక నిట్లని చెప్పు
ఇనకుమారుని తోడ
ముమ యుద్ధమున చంపి
తిని వాలి నొకనినే
ఇంక ప్రతిజ్ఞను దప్పి
న కృతఘ్నుని నిన్నొ
బంధువుల తో గూడ
వధియించెదను జూడు!"

మని చెప్పు మన కార్య
మునకు నేయే మాట
లను కూలమగునో నీ
వా మాటలను చెప్పు!
కాలమది మించె శీ
ఘ్రమె పొమ్ము నీ వింక!

అని అన్న రామన్న
అన్నంతలో కుపితు
డై లక్ష్మణుడు పలికె
ఆగ్రహా వేశమున.

## లక్ష్మణ రాయబారము

"ఇం దాక ఎందు క
న్నాదురాత్ముని వాని
మాట దప్పిన వాని
మట్టు పెట్టెద నేనె!
అంగదుడు రాజగును
అతడు వానర సైన్య
ముల సహాయము తోడ
పుడమి తనయను వెదకు—"

అని తనదు నిర్ణయం
బును లక్ష్మణుడు దెలుప_
ఆ మాటలకు రాము
డాలోచనము చేసి
సాను నయముగ బలికె
సౌమ్యుడై ఈ రీతి_

"మిత్రవధ గాదిపుడు!
శత్రువధ గాని కో
పమున పాపము నేయ
పనులు చెడు గాన కో
పము వివేకము చేత
పరి హరింపగ వలయు!
అట్టి వాడే పురుష
లందును త్తముఁడు!
అటుగాని వాడవని
యందు నధముండు!

కాలమున కతడు స
క్రమముగా మాత్రమే

రాలేదుగాని అప
రాధమేమి యొనర్చె?

కాన మంచి తనాన
కార్యమును సాధించు
కొని రమ్ము పరుషముగ
నన వలదు నేమియును.

పరుషముగ మాట్లాడ
భగ్నమగు పనులు!
పరసముగ మాట్లాడ
సఫలమగు పనులు!"

అన్న చెప్పిన ధర్మ
మనుసరించి అడంచు
కొనె కోపమును అన్న
కనుకూల వర్తనుఁడు.

అయిన కోపావేశ
మది మదిని రగులగా
త్రోవ కడ్డగు చెట్లు
త్రోసి పడ ద్రోయుచును

శిలలు పడద్రోయుచును
శీఘ్రముగ బోవుచును
కిష్కింధ కరిగె లక్ష్మణుడు!
కిచకిచమ్మనిరి కపులపుడు!

తన అన్న దుఃఖమును
తలచుకొని తలచుకొని
వంచించగా నుపే
క్షించె సుగ్రీవుడని,
లక్ష్మణుని మనసులో
రగిలె కోపానలము.

వేడి నిట్టూర్పులను
విడుచుచును, కనుల ని
ప్పులుగ్రక్కుచును, పొగలు
చెలరేగు విప్పువలె
అగుపించినాడు లక్ష్మణుడు!
అతడెంత అతిభయంకరుడు!

బాణములు నాల్కలుగ
బలువిల్లు పడగగా

తేజస్సు విషముగా
తేజరిల పంచాస్య
ఘన సర్పమటు భయం
కరుడుగా నొప్పుచున,
ప్రళయ కాలాగ్ని వలె
ప్రజ్వరిలుచున, కుపితు
డై ఆది శేషునిగ
అవతారమెత్తె నన
అగుపించినాడు లక్ష్మణుడు!
అతడెంత అరిభయంకరుడు!

అత్యంత దుఃఖితుని
అంగదుని గాంచి, వ
త్సా! యంచు బిలచి ఆ
జ్ఞాపించె నీరీతి—

"నా రాక సుగ్రీవు
నకు దెల్పు శీఘ్రమ్ము!
నామాట విన దలచె
నా వేగ రమ్మనుము!

లేక నను తన దగ్గ
రికి పిలువ నంపు కొను
మనుము, నీవిక వ
త్సా! పోయి రారమ్మ!

అన్న దుఃఖమునకు మ
హా తాప మెక్కి ల
క్ష్మణుడిటకు వచ్చినా
డని చెప్పు మంగదా!"

అంత అంగదుడు డాత్ర
మాత్రమున అంతఃపు
రములోని కరిగి విష
యము చెప్పె సుగ్రీవు
నకు కాని ఆ మూర్ఖు
నకు నేమి వినపడదు!

మద్యమును సేవించి
మత్తులో చిత్తగుచు
మదనకేళీ శ్రమకు
నిదురలో బధిరుడగు

సుగ్రీవునకు మాట
సుంతైన వినరాదు.

ప్లక్షప్రభావు లను
పరమ మంత్రులు వచ్చి
సుగ్రీవునకు హితము
సూక్ష్మముగ వివరించి

ధర్మార్థ కామముల
మర్మముల నెరిగించి
రామ కార్యార్థమై
రవి సుతుని మేల్కొలిపి

లక్ష్మణుని కోపాన
లను సంగతివి చెప్పి
అతని దర్శించగా
ఆలసించకు మనిరి.

అంత సుగ్రీవుడ
త్యంత భీతాత్ముడై
తనకు ధైర్యము లేక
తారనే పంపించె.

సఖుని సంపాదించ
సాధ్యమగు కాని ఆ
సఖ్యతను నిలుపుకొ౯న
చపలునకు సాధ్యమా!

## తార

చిత్తుగా త్రాగినది
మత్తు కన్నులు గలది.
అరమూత కనులతో
అటిటు సొరుగునది.

కుచ కుంభ భారాన
కొ౦౦చెముగ వంగినది.
సంభోగ వివశయై
శ్రమతోడ నడుచునది.

సురతకేళీ చిహ్న
శోభ లెగజిమ్మునది
కేళీ విలాసముగ
కేశములు చెదరినది.

ఆపుడపుడె భర్తగా
డాలింగనము నుండి
విడివడ్డ తార తా
తడబడుచు వచ్చినది.

చండ సురతాలసత
నుండి తేఱక తొట్రు
పాటుతో బరువుతో
పాన మదమున దేలి
పోవు నేత్రాలతో
బొడ్డు క్రిందుగ పోక
ముడి పడలిపోగ కా
ల్మొదులు పడు నడుకతో
అదె తార వచ్చినది చూడ!
మదవివశ యైనదా ప్రౌఢ!

స్మర కళా కేళిలో
సడలి సగముగజాఱి
బంగారు మొలనూలు
రంగారు కటిమీద

లీలా విలాసముగ
వ్రేలాడు చందగా
తూలుచును సోలుచును
లోల నేత్రాలతో
అదె తార వచ్చినది చూడ!
ఆమె నవనవలాడు ప్రౌఢ!

సన్ననగు నడుముతో
చారు నేత్రాలతో
పొరొందు బంగారు
చాయతో అంగాంగ
సౌష్ఠవముతో నిండు
జవ్వనముతో గొప్ప
చనులతో తప్పత్రా
గిన నిషాకనులతో
తనరారు అతార సొగసు!
మునికైన చలియించు మనసు!

కంతు తాపాన కొ డి
గట్టి పగపొగ చూరు

మగసిరివి కవ్వించు
మరుబూరు నూగారు
కనుపించునటు చీర
కటి మండలము మీద
జరజరా చిలిపిగా
జారి పోతుండగా
సర్దు కొనకే వచ్చెతార!
చల్లార్చగా అగ్నిధార!

వణకు మధ్యమ్ముతో
బెణకు జఘనమ్ముతో
కొంచెముగ కదలాడు
కుచకుంభయుగముతో
విపద సమయములోన
విభున కడ్డు పడంగ
ఎడద కలవర పడగ
అడుగులవి తడబడగ
అదెవచ్చెతార ఆత్రముగ!
అగ్గిపిడుగున వడ్డుకొనగ!

స్తన కుంభములు గదల
జఘన మండల మదర
కౌను జవ జవలాడ
కైపు కన్నులదేల
వడివడిగ అడుగులిడ
వశమింత గాకుంట
తొణకాడు వళులతో
తొట్రుపడు నడకతో
చను దెంచె ప్రియుని గాపాడ!
చతురోక్తి సమరస ప్రౌఢ!

ఆమె సుస్నిగ్ధరుచి
రాంగ! సరస ప్రసంగ!
ఆమె ప్రౌఢాంగ నా
నంగ సాంగోపాంగ!
ఆమె నిగ నిగ లాడు శ్యామ!
ఆమె మిలమిలలాడు భామ!
ఆ భామకెదురు మాట్లాడ!
అదరిపడు మన్మథుడుగూడ!

ద్రవ్యోల్బణమ్ములో
ధనికోద్ధతుల మధ్య
నెరి నలిగి మధ్యముడు
నిరుపేద యైనట్లు
కవ్వించు వయసులో
ఘన జఘన కుచదుర్గ
ముల మధ్య కృశియించి
నలుగు మధ్యమ్ముతో
తరబడుచు వచ్చినది ప్రౌఢ
బెదదలో విభుని గాపాడ!

మగడు మరణించగనె!
మరిదినే చేసి కొని
మంత్రాంగమును నెరపు
మహిత చతురత గలది.

తన కులాచారమ్ము
ననుసరించుట యందె
తనకు మేలున్నదని
తలచినది కాబోలు!

"విన్న గతియించె రే
పన్న దెవ్వ దెరుంగు?
నిలుచున్నదిర నేడు
నీ ముందు నీవింక
మధువుతో వధువుతో
మై మరచి సుఖియించు
అమరత్వ మిదై అందుకోర!
'ఉమరు' లోనే జుర్రుకోర!"
అను తార సిద్ధాంత
మందున్నదా నిజము?
ఇహ పరార్థము లందు
ఏదిరా సుఖము!
ఒకటి అస్థిరము వే
రొకటి సుస్థిరము!

మద వివశయై మద్య
మద వివశయై అర్ధ
నగ్నమై సంభోగ
చిహ్నములతో క్రీడ

లేవిధై కట్టడులు
లేవిధై తూలుచును
మగవాని ఎట్టెదుట ప్రౌఢ
తెగి యించి వచ్చినది చూడ!

తల్లి తన పసిబిడ్డ
దగ్గరకు వచ్చెనా!
స్త్రీలు శుకముని ఎదుట
చీరలను వీడిరా!
అన్నట్లు చేసినది
ఆమె ఎంతటి చతుర!
తెలిసి చేసిన దేమొ
తెలివి గలదా తార!

ఎట్లైన గాని తా
నెట్లున్న దట్లుగా
లక్ష్మణుని కోపాన
లమును చల్లార్చగా
మదన శయ్యను వీడి
మదనాంగి వచ్చినది
మత్తులో మర్యాద
మరచి తెగియించినది.

తన ఎదుట వచ్చి ని
ల్చిన లజ్జ లేనిదగు
మదవతిని మధుమతిని
మరులు కొల్పెడు రతిని
గాంచి లక్ష్మణుడు తల
వంచుకొనె లజ్జతో
కోప మెచ్చటి కేగెనపుడు?
కోమలాంగుల చూచునపుడు!

అతడు రాముని తమ్ము
డతడు శిష్ట వ్రతుడు
అన్య కాంతల యెడల
ఆదరణ గల వాఁడు
తన ఎదుట వచ్చి ని
ల్చిన పర స్త్రీని గని
కనుల నిప్పు కణాలు
క్షణ మారి పోయి, ఆ
మెను ఆమె పైనమును
గని కినుక రవ్వంత
చల్లార తల వాల్చినాడు
సౌమిత్రి ముని మించువాడు.

ఆడవాళ్ళెదురైన
ఆదరించు మహాత్ము
డని తెలిసి శ్రద్ధమగు
అతని మనసు నొకింత
చల్లబడు నటు మర
ల్పగ వచ్చునని యెంచి
ఆత్రముగ నెదుతేగి
అరచు కొనగా నెంచి
అల్లెగు డెంచినది తార
ఆమె ఎంతటి చతుర ధీర!

మద్యమ్ము మత్తులో
మగువ లజ్జను వీడి
జంకు గొంకుమ లేక
సరసముగ సఖ్యముగ
సౌమిత్రి కోపమది
చల్ల బడుటను జూచి
ధైర్యముగ దర్పముగ
తార యిట్లని పలికె—

"రాజపుత్రా! ఎందు
లకు కోప మూనెదవు?
ఎవరయ్యా నీ ఆజ్ఞ
నిపుడు మీరినవారు?
ఎండు టడవి దహించు
మండు కార్చిచ్చులో
ఉరికి పడనెంచు వా
నరుడెవడు? నరుడెవడు?"

అని తార పలుక ల
క్ష్మణు డిట్లు బదులాడె
ఆతని మాటలు ఈటె
లై గుండెలో దూరె!

"ధవుని మేలే కోరు
తరుణి తారా! నీవె
రుంగవా నీ మగడ
నంగ సాంగోపాంగు
డై విస్మరించె ధ
ర్మార్థముల, మమ్ములను.

పవలనక రేయనక
పానమే ప్రాణముగ
సేవించు చున ప్రజల
సేవించకచు రాచ
కార్యముల జూడకను
గడుపు మా ఱెత్తకను
కామోపభోగముల
కన్న గానక వీడు
కష్టదుల, ధర్మార్థ
కామముల విడనాడి
స్నేహితుని వంచించినాడు!
చెప్ప మెంతటి మోసకాడు!

కాలమానము తెరిగి
కార్య తత్వము దెలిసి
నట్టి దానవు నీవు
ఇట్టి స్థితిలో మేము
ఏమి సేతుము చెప్ప
మిక నీవె కామినీ''

నీ ధవుడు వంచకుడు కాడ?
బాధ కల్గును వాని జూడ!

లక్ష్మణుం డాతు వి
లక్షణంబగు మాట
లందర్థ మెరిగి యి
ట్లని పలికినది తార-

"రాకుమారా! ఇంత
రాజసము తగదు! సా
త్వికము నీ వంటి ధా
ర్మికున కుండగ వలయు!

సాత్యికముతో పనులు
సమకూరు గద! తమో
రాజసముతో కా
ర్యములెల్ల చెడు గదా!

స్నేహితుని మీదనే
చేయదగునా కోప
మింతగా! ఇది సమయ
మెంత మాత్రము గాదు!

మీ వాడు సుగ్రీవు
డో వీర! స్వజనాళి
పై కోప మూనగా
పాడిగా దెన్నటికి.

కామోప భోగియై
కార్యమందున శ్రద్ధ
చూపలేదంతలో
కోపమూనుట తగదు

వీరుడగు వాడు గం
భీరుడగు వాడు తన
కన్న బలహీనుపై
కన్నెఱ్ఱ సేయునా?

మీ కన్న బలహీను
డేకదా సుగ్రీవు
డతనిపై మీకింత
ఆగ్రహమ్మెందులకు?

గడువు దాటిన గూడ
కనిపించడవి కపీం
ద్రుని మీద కినుక బా
ల్చెను రాముడని తెలుసు.

గడువు మాటెదుగుదుము
కాని మన్మథ బాధ
కెంత వానికి గూడ
ఇంత సైపగ రాని
కారణము నెరుగుదును.
గడువు మాటెరుగుదుము.

లక్ష్మణా! నీ కోప
లక్షణము చూడగా
కామ శాస్త్ర జ్ఞాన
మే మాత్రమును లేని
వానివలె పసిపిల్ల
వాని వలె నున్నావు.

కామపరతంత్రునకు
కాలమును దేశమును
ధర్మమును అర్థమును
తలపుకే రాకుండు.

ధర్మవేత్తలు తపో
ధనులు ముని పుంగవులు
కామునకు లొంగి స్త్రీ
వ్యామోహితులు గారె!

ఇక వానరుని మాట
దెంత! సహజమ్ముగా
చపల చిత్తుడు గాన
అపరాధముల చేసె.

అయిన మా సుగ్రీవు
డప్రమత్తుడు సుమా!
గడువు 'దాటక ముందె
కార్య సాధన కొరకు
ఎన్నో ప్రయత్నాలు
ఎప్పుడో యొనరించె"—

అని చేతులను ద్రిప్పు
చును విలాసము గొల్ప
మత్తులో తూలుచును
మాట్లాడుచును ఇంక
ఇట్లనుచు పలికినది
ఇంతి త్రాగిన తార—

ఈమూల కొదిగి నీ
వేల నిలుచున్నావు?
ఇంకా సదాచార
మేలు కొను చున్నావు!

కాని మిత్రుల సతుల
కనుట దోషము కాదు
కాన నాతో నీవు
లోని కరుదెంచదగు!
సుగ్రీవు కపిరాజు
చూచి మాట్లాడదగు!

రా రమ్మ! నాతోడ
రాకుమారా! లోని
కరుదెంచి సుగ్రీవు
నరసికొని మాట్లాడు."

మని పలికినది తార
ఆమె ఎంతటి చతుర!
ఆమె మరు శాస్త్ర విజ్ఞాన
ఆమె ఒయ్యారి నెరజాణ!
ఆమె ప్రౌఢ రసప్రసంగ!
అంగసౌష్ఠవ మంగళాంగ!

అన్న పరితాపమున
కత్యంత కుపితుడై
కోదండ పాణియై
క్రోధాగ్నిహోత్రుడై

అంతః పురములోని
కరుదెంచి లక్ష్మణుడు
అహో! ఎదుట ప్రత్యక్ష
మైనంత సుగ్రీవు
డదరిపడి లేచె సిం
హాసనముమండి చం
ద్రుని రాకతో చుక్క
లను మొలచి వచ్చినటు
స్త్రీజనము లేచి ని
ల్చిరి కపీంద్రుని తోడ_

మన్మథా వేశమున
మధుపాన మత్తులో
రామ కార్యము మరచి
కామ పర తంత్రుడై
మద వతుల నడుమ తన
ఎదుటనే కనుపించు
సుగ్రీవు జూడగనె
ఉగ్రుడై లక్ష్మణుడు

నర్మ గర్భితములగు
ధర్మార్థములు దెలుపు
పలుకులే ములుకులై పోగ!
భాషించె ఎదగ్రుచ్చుకోగ!

"మును ముందు తన కార్య
ములను చేయించు కొని
పిదప ప్రత్యుప కార
మది చేయ మరచు వా
నిని కృతఘ్నుని వధిం
చిన పాప ముండదని,
అట్టి వానిని ఎవ్వ
రైన చంపగవచ్చు
ననియు మను వనె కృత
ఘ్నునికి నిష్కృతి లేదు."

నాటికిని నేటికిని
నక్కజిత్తులు పన్ని
సీ మాట నెరవేర్తు
నా మాట వినుమంచు

నీకంట నా వ్రేలు
నాపంట నీ వ్రేలు
అన్నట్లు అనువయము
వెన్నవలె చిందించి
నమ్మించి మాట్లాడి
నయవంచకాధముడు
తన పనులు నెరవేర్చు
కొని పిదప మాట ద
ప్పును కృతఘ్నదవాగ్ని
జోకార్చు వారెవరు?
వాని శిక్షించ లక్ష్మణుడు!
కానరాడాయె గద! ఇపుడు!—

"కప్పవలె నరచుచును
కప్ప తన దరిజేర
కబళించు సర్పమటు
కార్యార్థమై సత్య
వంతునిగ నటియించు
వంచకుడ వీవిపుడు
గ్రామ్య సుఖముల దగిలి
రామకార్యము మరచి

మాట దప్పితివీవు
మందూక మట్లరుచు
పాముబోలిన నిన్ను
రాము డెరుగక నమ్మె!

ఒకవేళ రఘువరుని
ఉపకారమును మరతు
వేని యిపుడే తీక్ష్ణ
బాణముల నిను చంపి

వాలి యొద్దకు పంపు
వాడ ఓ వానరుడ!
రామ కార్యమును మరువకుము!
నీ మాట నెరవేర్చుకొనుము!

వాలి మా అన్నచే
వధియింప బడి ఎట్టి
మార్గమున చనెనొ ఆ
మార్గమిప్పుడు మూయ

బడలేదు కాన నీ
ప్రతిన నెరవేర్చుకొని

వాలి పోయిన దారి
వానరా! పోవలదు!
నీమాట నిలబెట్టుకొనుము!
రామ కార్యమును మరువకుము!

ఇన కులోత్తముని రా
ముని ధనుర్బాణముల
వాడి నీవింక చవి
చూడ కుండుట నెమొ!
మనసులోనైన రా
ముని కార్యమును దలచ
కున్నావు భయములే
కున్నావు విషయలం
పటుడవై సుఖముగా
బ్రతికి పోతున్నావు.
వాలి పోయిన దారి
మూయబడలేదు!
వానరా! ఆ దారి
నీవు పోవలదు!

పరుషముగ లక్ష్మణుడు
పలుకగా నీరీతి
నెరజాణయగు తార
నేర్పుతో నిట్లనియె!

"వీరవర! లక్ష్మణా!
వినుమయ్య నా మాట-
ప్రియ మిత్రుడైన సు
గ్రీవుతో పరుషముగ
మాట్లాడ మీ వంటి
మహితాత్ములకు తగదు!

కపి వరుడు సుగ్రీవు
డపరాధి కాదు, క్రూ
రుడు కాదు, కుటిలాత్మ
కుడు కాదు, నయవంచ
కుడు కాదు, అనృత మా
డెడి వాడు కాదు మీ
యుప కారమును మరచి
యున్న వాడును కాదు-

ఇంత కోపము సేయ
ఎంత మాత్రము తగదు.

మునుపు విశ్వామిత్రు
డను మునీంద్రుడు మేన
కను పొంది కాలమును
గమనించగా లేక
పదియేండ్ల కాలమొక
పగలుగా భావించె-

అంతటి మునీంద్రుడే
అట్లు మన్మథ పార
వశ్యమున కాలము ల
వంబెరుగ డయ్యె, అ
న్యుల మాట చెప్పగా
వలెన నాయన వీవు?

ఈ విగూఢ రహస్య
మెరుగ కుంటివి, గాక
సుగ్రీసు వయినింత
అగ్రహంబూనెదవ?

సత్య గుణవంతులగు
సత్పూరుషులు మీరు
ధర్మార్థ కామముల
మర్మ మెరిగినవారు.
ఇట్లు యుక్తా యుక్త
మెంచ కుండగ తటా
లున స్త్రీల ముందు మి
త్రుని పరిభవించుచును
ఇంత కోపము సేయ తగున?
ఇది మిత్ర మర్యాద యగున?

అయిన మా సుగ్రీవు
డప్రమత్తుడు సుమా!
గడువు దాటక ముందె
కార్యసాధన కొరకు
ఎన్నొ ప్రయత్నాలు
ఎప్పుడో యొనరించె.

రామ కార్యార్థమై
రాజ్యాది భోగముల
వర్జించు వాన రే
శ్వరుడు భాస్కర సుతుడు.

నీ విటకు రాక ము
న్నే వానరుల నిటకు
నచ్చుటకు ఆజ్ఞలను
ఖచ్చితముగా నిచ్చె-

వచ్చెదరు వచ్చెదరు
వగ జెంద వలదు వా
నర వీర సైన్యముల
నరవరా! వచ్చెదరు!

కోట్లాది భల్లూక
గోలాంగ వీరవరు
లందరీ నాటి కిట
కరుదెంచగా వలయు!

గాన నీవిక ఎటద
కలత మానగ వలయు
శాంతమును దాల్చి ప్ర
సన్నుడవు గావలయు

మునువాలి వధభయం
బును బొంది యున్నవా

రగుటచే అట్లేమి
యగునొ! యని భయపడుచు
ముఖ మెఱ్ఱబడి కోప
మున మండు చుండు నీ
నెత్తురుల కవలు గని
నిమ్మళము గోల్పోయి
వానర స్త్రీ లెల్ల
వణకు పట్టిరి గాన
సత్యగుణ సంపన్న!
శాంతింపు మన్నా!
మహిత గుణ లక్ష్మణా!
మాట విను మన్నా!"

అని ఇట్లు సమరస
మ్మున తారపలికినది.
అంత చిచ్చర పిడుగు
వలె చల్లార్చినది.
అభాను ఎంత లోకజ్ఞ!
అలేమ ఎంత సమయజ్ఞ!

## సమరసం

జలము గురియగ అగ్ని
చల్లారి నట్లుగా
సహజ సాత్వికుడైన
సౌమిత్రి శాంతించె.

సూక్ష్మ విజ్ఞాని యగు
సుగ్రీవు డది గాంచి
తడి గుడ్డ విడినట్లు
తన భయము విడి పోగ
నిర్భయుండై పోయి
నిర్భరత నిట్లనియె!

"రామానుజా! నాకు
రాముని అనుగ్రహము
వల్లనే కద నన్ను
వదలి పోయిన సిరియు
సంపదయు రాజ్యమును
సమ కూరినవి గాక–

ఓ లక్ష్మణా! రాము
డొనరించినట్టి మ

హోప కారమున కెవ
డోయి ప్రత్యుప కార
మొనరించగలవాడు
ఉర్విలో మొనగాడు?

తన పరాక్రమము చే
తనె రావణుని జంపి
మహితనయ బొందగల
మహిత వీరుడతండు.

అతని వెంటను నడచు
అనుచరుడనే కాని
అసహాయ శూరుడగు
ఆ మహా వీరునకు
నే సహాయ మొనర్ప
నెంత వాడను కపిని

ఆశ్రితుడ, భృత్యుడ, మ
హాత్ముడగు రఘువరుడు
నన్నేమి సేయడను
నమ్మకముతోనేమి,

తనకు చెలికాడనను
చనువుతో నేమి కొం
చెము కాలయాపనము
చేసియుండిన యెడల
క్షంతవ్యుడను నన్ను
క్షమియించ వలయు!
మందజ్ఞుడను నన్ను
మన్నించ వలయు!

తప్పు చేయని వారు
ధరణి గల రెవరు?
నా తప్పు మన్నించు
నాథు లింకెవరు?

ఆశ్రితుడ స్నేహితుడ
ఆదరణ వలయు!
తప్పు చేసితి నన్ను
దయ జూడ వలయు!"

అని ఇట్లు వినయముగ
ఇనకుమారుడు పలికి

సంత రామానుజుడు
సంతుష్టుడై పలికె.

"వానరేంద్రా! పుడమి
లోన మా అన్న నీ
వును దక్క సామర్థ్య
మును గలిగి పొరపాటు
జరిగి పోయిన యెడల
సత్వరమె తమతప్పు
దెలిసికొని అద్దాని
తెలివితో నొప్పుకొని
ఇట్లు మాట్లాడు వారెవరు?
ఇల నిన్ను మించుహితుడెవరు?

అన్న రామన్న దుః
ఖాతిశయ మం దనిన
మాటలకు పరుషముగ
మాట్లాడితిని గాని
మనసులో నుంచకుము దాని!
మన్నించు ప్లవగ భూజాని!

ఇకనీవు వెను వెంట
నే బయలు దేరి రా
వలయు! రామప్రభుని
వగ దీర్చగా వలయు!

అని లక్ష్మణుడు పలికి
నంత కపిరాజు తన
ప్రక్క నిలచిన మంత్రి
వరుని హనుమంతుగని_

"ఈ భువన మందు వసి
యించు నట్టి సమస్త
వానరుల బిలచు కొని
వచ్చుటకు శీఘ్రముగ
కబురంపగా వలయు హనుమ!
కపులెల్ల రావలయు వినుమ!

నా అజ్ఞ ఇది పది
నాళ్ళ కిపటికి రాక
తప్పదిది నా ఆజ్ఞ
తప్పువారి వధింతు.

ఇదియె సుగ్రీవాజ్ఞ హనుమ!
ఇక ప్లవగులకు చాటి చెపుమ!"

అపుడంత హనుమంతు
డంపె వానర దూత
లందరిని దశదిశల
కందరిని బిలచుకొని
వచ్చుటకు వానరులు
వచ్చుటకు శీఘ్రముగ-
స్వామి ఆజ్ఞ వహించి
రామ కార్యార్థమై
అన్ని దిక్కుల నుండి
ఎన్నెన్నొ కపిసేన
లాత్రమున సుగ్రీవు
నాజ్ఞ విన్నంతనే
దండు దండుగ సాగి
తరలి వచ్చెను వేగ-

ఆ కపులు రాజమ
ర్యాదలను పాటించి

ఫల పుష్ప మాలికల
పరమౌషధముల గొని
సుగ్రీవునకు నిచ్చినారు!
శుభగుణులు వానరులా వారు!

అంత లక్ష్మణ సహితు
డై వానరేశ్వరుడు
పల్లకిని ఎక్కి తా
పయనమై వచ్చి ని
ల్చెను రామ పాదాల చెంత!
చేతులను మోడ్చి తానంత!

అపుడు రాముడు చూచి
అతని తన చెంతనే
ఆసీను గావించి
అతనితో నిట్లనియె–

"ధర్మార్థ కామముల
తగ విభాగము జేసి
దేనినే కాలమున
పూని పొందగ వలెనొ
దాని నా కాలమున
తగ ననుభవించవలె–

కాని ధర్మార్థముల
కాదంచు ఎల్లపుడు
కామమును మాత్రమే
కాంచి సేవించుచో
వృక్షాగ్రమున నిద్దు
రించు వాడటు క్రింద
పడికాని మేల్కొనడు
పరమార్థమిది గనుము.

శరదృతువు వచ్చినది
శత్రువుల వధియించ
సమయమిది నీవింక
సమకూర్చు సైన్యముల".

అంత సుగ్రీవు డ
త్యంత వినయముతోడ
మాట్లాడగా సాగె
నిట్లు రాముని తోడ-

స్వామి! మీ దయచేత
సంపదలు రాజ్యమును
సమకూరినవి మాకు
తమ దయకు పాత్రుదను.

ఘోర రూపులు మహా
వీరులౌ కోట్లాది
వానరులు ఇపుడిపుదె
వచ్చిపడి యున్నారు.

రావణుని చంపి నీ
దేవి సీతను తెచ్చి
అర్పించ గలవారు
అరుదెంచి యున్నారు"

తనదు కార్యార్థమై
ఇనసూను డొనరించు
యత్నమును జూచి రా
మయ్య హర్షము నొంది
మోము నీలోత్పలము
బోలి కలకల లాడ
రామచంద్రుదు మరీ
శ్యామ సుందరు డయ్యె!



## సేనావాహిని

సూర్యకాంతి నావరించి
సుడి దుమ్ములు లేచె నిపుడు
కిచకిచ లాడుచు నుండెను
కిష్కింధా నగర మిపుడు.

కారు మబ్బు వంటి వారు
కామ రూపులగు వారలు
మార్తాండుని వంటి వారు
మహా బలులు మహాకవులు

నగేంద్రముల నుండువారు
నదీతీర వాస్తవ్యులు
పర్వతముల బోలువారు
బలవంతులు ప్లవగేశులు

ఎందరెందరో వచ్చిరి
ఎటు చూచిన కనిపించిరి
లెక్కకు మించిన ప్లవగులు
పెక్కండ్రుగ వచ్చి పడిరి.

శతవలి పదివేలకోట్ల
చండ కపులతో వచ్చెను
అనేక వేల కోట్ల కపుల
తోను [1]సుషేణుడు వచ్చెను.

అట్లే [2]తారుడు సహస్ర
కోట్ల కపులతో వచ్చెను
మూడు కోట్ల ప్లవగులతో
వాడి పవనుడదె వచ్చెను.

ఇరువ దొక్క వేలమీద
ఎనబై వందల దెబ్బై
మంది కపులతో కేసరి[3]
మారుతి జనకుడు వచ్చెను.

వెయ్యి కోట్ల కపులతోడ
వెడలి వచ్చె [4]గవాక్షుండు!
వేలు రెండు కోట్ల తోడ
వేగ వచ్చె [5]ధూమ్రకుండు.

---

1. తార తండ్రి; 2. రుమతండ్రి; 3. హనుమంతుని తండ్రి; 4 కొండ ముచ్చుల రాజు; 5 భల్లూకరాజు,

నీలుడు పదికోట్ల వాన
రాల దండుతో వచ్చెను
గవయుడై దు కోట్లమంది
కపిసేనలతో వచ్చెను

దరీముఖుడు వేయికోట్ల
దండి కపులతో వచ్చెను.
రంభు [1]డాయుతమ్ము సహ
స్రంబు శతముతో వచ్చెను.

గజుడు మూడు కోట్ల మంది
కపి వీరులతో వచ్చెను
జాంబవంతుడు పదికోట్ల
సైన్యముతో చనుదెంచెను.

పదికోట్ల బలంబుతో ద్వి
విద మైందులు చనుదెంచిరి
నూరుకోట్ల కపివీరుల
తో రుమణ్వతుడు వచ్చెను.

1. ఆయతము=పదివేలు

గంధమాదముడు పది ల
క్షల కోట్ల బలంబు తోడ
నలుడు నూరు లక్షల కో
టుల వానర సైన్యముతో,

హనుమంతుడు వేయికోట్లు,
అంగదుం డనేకమైన
పద్మంబులు శంఖంబులు
బలగంబులతో వచ్చిరి.

తారుడు శరభుడు కుముదుడు
దధిముఖుండు దుర్ముఖుండు
రంహ వహ్ని ఇంద్రజాను
రణసింహ లనేక మైన
కపి సేనలతో వచ్చిరి
కపినాథుని కడజేరిరి.

ఆ సమస్త సైన్యంబులు
అంబుధులటు గర్జించుచు
నేలంతా నిండిపోయి
గోల గోలగా నరచుచు,

ఉత్సాహాతిశయముతో
ఉదధివోలె ఉప్పొంగుచు,
అంతులేని సంబరాన
అంబరాని కెగురుచు సూ
ర్యుని బరివేష్టించు నట్టి
ఘన మేఘములట్లు కపీం
ద్రుని సుగ్రీవుని చుట్టిరి
రణోత్సాహులై సేనలు.

సింహనాదములు సేయుచు
శిరము నెత్తి చూపుచు తమ
రాక నెరింగిచిరి తమ
రాజున్యైన కమిత భక్తి

అందున కొందరు ముఖ్యులు
అర్క సుతుని సమీపించ
తగిన వారు వస్త్రాదుల
తగ ముడుచుక కేలుమోడ్చి
సవినయముగ సుగ్రీవుని
సమీపించి నిలుచుండిరి.

అప్పుడు సుగ్రీవాధిపు
డమితమైన భక్తితోడ
"ఆజ్ఞాపించుడు రామా!"
అని సేవల నర్పించెను.

అవ్వానర సైన్యంబుల
ఆ పిదపను గలియజూచి
వానరవరులారా! ఇక
వనములందు కొండలందు
సెల ఏరుల తీరంబుల
చేరి విడిది సేయు" డనుచు
అర్కసుతుడు సుగ్రీవుడు
ఆజ్ఞాపించుచు పలికెను.

## సేనావ్యవస్థ

"ఇది నీ సైన్యము రామా!
ఇక నీ ఇష్టము చొప్పున
నీవే ఆజ్ఞాపించుము
నీ ఆజ్ఞల తలదాల్తుము.

కార్య తత్వమే నెరుగుదు
కాని నీవె నీ దోచిన
విధమున నాజ్ఞాపించుము
వీర లెల్ల తలదాల్తురు

రామా! నీభృత్యులమయి
మేమెల్లరమును నీ కయి
సర్వస్వము త్యజియింతుము
కార్యము నెరవేర్చగలము"

ఇట్లు పలుకు సుగ్రీవుని,
ఇనకుల తిలకుడు రాముడు
తన చేతుల కౌగిలించు
కొని యిట్లని పలికె నపుడు-

"హితుడవు, స్నేహితుడవు పం
డితుడవు, సాధకుడవు నీ
వే ఈ పని సేయ తగదు
వీవే ఆజ్ఞాపించుము."

అని రాముడు పలికినంత
ఇన సుతుడీ విధి వ్యవస్థ
చేసి సైన్యముల నంపెను
సీతాన్వేషణ కొరకయి

ఇది సీతాన్వేషణయా!
ఇది సత్యాన్వేషణయా!
ధర్మ రక్షణార్థంబయి
తలకొాను సంఘర్షణయా!

"ధర్మో రక్షతి రక్షిత":
దాని గూర్చి చెప్పవయ్యా
తిర్యగ్జంతువు లైనను
తెగువ జూపు రసప్రియా!

లక్షసైన్యముల నొసంగి
దక్షుని వినతుని తూరుపు
దిక్కుల కంపెను ఆ యా
దిశల విశేషముల దెలిపి.

మామ సుషేణునికి లక్ష
మంది సైన్యముల నొసంగి
పడమటి దిశ కంపెను ఆ
ప్రాంతములను గూర్చి చెప్పి

శతవలి కొాక లక్షమంది
సైనముల నొసంగి ఉత్త
రాదికి పంపెను ఆయా
ప్రాంత మార్గములను దెలిపి-

దక్షిణ దిశ ఎన్నికైన
దక్షతగల వీరవరులు
హనుమంతుడు జాంబవంతు
డంగదుడు సుహోత్రుడు నీ
లుడు శరారి శరగుల్ముడు
రుషభుడు మైందుడు ద్వివిదుడు
గంధమాధనుడు విజయుడు
గజుడు గవాక్షుడు గవయుడు
ఉల్కాముఖు డనంగుడును
ఉద్దండులు పెక్కండ్రును

వారలకు సహాయ్యముగా
వానర వీరుల దండును
ముందుగ పంపెను భాస్కర
నందనుడు వివేకధనుడు.

దక్షిణ దిశగా సీతను
దనుజు డెత్తుకొని పోవుట
చూచిన వాడగుట చేత
సుగ్రీవుడు దక్షిణ దిశ
కంపు వారి నెల్ల జూచి
ఎంపిక చేసెను బుద్ధిగ-

"దక్షులార! వీరులార!
దక్షిణ సాగర మందున
వంద యోజనాల లంక
ఉంది రావణుని పురమది."

అని చెప్పుచు ఇంకా ద
క్షిణ ప్రదేశముల నన్నిటి
వివరముగా తెలియ జెప్పె
విబుధవరుడు సుగ్రీవుడు.

"సీతను గని వచ్చు వాని
నాతో సమముగ జూతును
అతడు సకల సంపదలను
అనుభవించ గలడు భువిని"

అని ప్రోత్సాహోత్సాహము
లినకుమారు డానర బల్కి
హెచ్చరించె కపి వీరుల
నెల్ల దిశల కంపువేళ—
అధిపు డిచ్చు ప్రోత్సాహము
అమృతము వలె పని సేయును
జడు డౌత్సాహికుడై నవ
చైతన్యముతో సాగును.

## హనుమంతుని ప్రత్యేకత

అందరిలో హనుమంతుని
ఆదరమున జేర బిలచి
అతని భుజస్కంథముపై
హస్తముంచి సుగ్రీవుడు-

"హనుమంతా! గుణవంతా!
అతులిత ప్రతిభావంతా!
నీ అంతటి వీరుడెవడు?
నీ అంతటి శూరుడెవడు?

బుద్ధి బలము భుజ బలమును
శుద్ధమైన స్వామి భక్తి
దేశ కాలముల ననువ
ర్తించు యుక్తి ధీశక్తియు
నీ కున్నవి నీ వలె ఈ
లోకములో ఎవరయ్యా!
కార్య సాధకులు? నీపై
కార్య భార ముంచితి నిక.

హనుమా! సీతను వెదుకగ
అన్ని యత్నముల నేయుము
రామ కార్య నిర్వహణా
ర్థము పురోగమించుము ఇక!"

అని పలికిన సుగ్రీవుని
అర్థవంతమగు మాటల
నాలకించి రాముడు ఇ
ట్లను కొనె తన మనసులోన-

"ఈ హనుమంతుడు పూర్వము
ఎన్నో కార్యములను నెర
వేర్చి యుండుగాక ఇట్లు
విభుని చేత గౌరవింప

బడునే? పూర్వాపరాలు
పరికించిన గాని బుధులు
పని చెప్పరు గదా ఏరి
కిని అని మది తలపోయుచు-

"హనుమా! ఇటురా దగ్గర"
కని రాముడు హనుమంతుని

ప్రీతి తోడ చేర బిలచి
చేతి ఉంగరమును తీసి
అను రాగార్ద్రితలు పొంగ,
హనుమంతునితో నిట్లనె.

"హనుమా! ఏవీ ఉంగర
మును గొనుమా! దీని సీత
కానవాలుగా నిచ్చితి
దీని జూచి నంతటనే
మహి తనయకు నీపై న
మ్మకము కుదిరి మాట్లాడును."

అని తన పేరొనరగ చె
క్కిన ఉంగర మిచ్చినంత
హనుమంతుడు దాని నందు
కొని తలపై నిడుకొని చే
తులు మోడిచి రామపదం
బుల మీదను వ్రాలి మొక్కి
ఐయలు దేరె తన సేనా
బలము తోడ నప్పుడు చు

క్కల మధ్యన చంద్రుని వలె
కని పించెను హనుమంతుడు.

అంత మరల రాముడు హను
మంతునితో నిట్లు పలికె-
"పవన సుతా! నీవు మహా
బల శాలివి సింహమ ట్ల
క్ర విక్రమంబు గలిగి
ఎరలు పరాక్రమ శాలివి.

నేను నిన్ను నమ్మికొంటి
నీపై నీ బలము పైన
భారము వైచితి నీ విక
బల పరాక్రమాలు జూపి
నా సీతను కనుగొన వలె!
నా శోకము మాన్పగ వనె!"

## ఉత్సాహ తరంగం

రావణుని వధియించి వేతుము
రామ పత్నిని తెత్తుము!

భూనభోంతర ములను జొత్తుము
భూమితనయును తెత్తుమూ!

అనుచు వానర దండులంతా
అన్ని దిశలకు వెడలగా
అందులో ఒక్కొకడు బీరము
లాడ సాగెను గట్టిగా—

"రణములో నేనొక్కడనె ఆ
రావణుని వధియింతునూ
కష్టమున కంపించు సీతను
క్షణములో గొని తెత్తునూ—
ఏమయో మీరంత ఎందుకు
ఇక్కడే మీరుండుడీ!"

అనుచు వానరు డొకడు దంబము
లాడ సాగెను గట్టిగా
అంత ఇంకొక డందు కొని ఇ
ట్లనెను ఇంకీవిధముగా—

"కండ బలమును గుండె బలమును
నిండుగా గల వాడనూ
కొండలన్నీ పిండి చేతును
గుండె తీసిన బంటునూ—" ॥ఏమయో॥

చెట్ల నెల్లా పెరికి వేతును
గుట్లనే పడ ద్రోతునూ
జలధులను కల్లోల పరుతును
ఇలా తలము బగల్తునూ-

భూమి యందును జలధి యందును
భూ ధరమ్ముల యందునూ
అతల సుతల రసా తలంబుల
అన్ని తలముల యందునూ
అడ్డు లేకను సంచరింతును
అవనిజను కనుగొందునూ- ॥ఏమయో॥

ఒక్క యోజన మెగుర గలనని
ఒకడు గట్టిగ చెప్పగా-
వంద యోజనములను చెంగున
'వరె వరే!' నే నంచునూ-
అపుడు వేరొక డరచి చెప్పెను
అంత కన్నను గట్టిగా-

'వంద కన్నను మించి ఎగురుదు
సందియమ్మే లేదురా!'

అనుచు మరియొక దరచి బీరము
లాడె మరి మరి గట్టిగా-

ఈ విధమ్ముగ గంతు లేయుచు
గావు కేకలు పెట్టుచూ
ఒకరి కన్నను ఒకరు మిన్నగ
ఉద్ధతుల మని చాటుచూ

మంద బలమును జూచుకొని ఇ
ట్లుంద రుత్సాహమున బలికిరి.
సంఘ బలమున కన్న బల మీ
జగతి లేదని బుధులు చాటిరి.

## సీత కనపడలేదు

వానర యూధము లుత్సా
హాన వెడలి తమ కాజ్ఞా
పించి నట్టి దిక్కులన్ని
వెదకి వెదకి వైదేహిని
గానక నెల గడువు దీర
దీన వదనులగుచు నిరు

త్సాహముతో సుగ్రీవుని
సన్నిధి కరుదెంచి నారు

"తూర్పు పడమ రుత్తరాదు
లోరుపుతో నేరుపుతో
అంగుళ మేనియు వదలక
అంతా వెదకితిమి గాని
సీత కానరాక పోయె!
నేతా! మేమేమి సేతు
మైనా మన హనుమ దాదు
లమ్మ వారు కొని పో బడి
నట్టి దిశకు వెళ్లి రి వా
రా తల్లిన గని వత్తురు!"
అని వివరించిరి శతవలి
వినత సుషేణాధి పతులు.

అడవి యంత వెదకి వెదకి
అలసి సొలసి పోయిరి ద
క్షిణ మంతయు గాలించిరి
సీత జాడ తెలియరై రి.

నిరుత్సాహ మొందిన వా
నరుల జూచి అంగదుండు
కార్యోత్సాహముల జేయగ
ధైర్యము జెప్పుచు నిట్లనె-

"ఓ వానర వీరులార!
ఉత్సాహముతో లెండీ!
కదలండీ! సీతమ్మను
వెదకండీ! వెదకండీ!

నిర్విరామ శ్రామికులై
నిరంతరము వెదకండీ!
స్వామి కార్యమందు మీరు
సోమరులై పోకండీ!

వానరులారా! బద్దక
మూన వలదు లెండు లెండు!
నిదుర మాని దిగులు మాని
ఎదనిండా ధైర్య మూని
వెదకండీ! వెదకండీ!
వైదేహిని వెదకండీ!

వదలకుండ చేసిన యే
పని మైనను అయి పోవును
నిముస మైన వీడకుండ
నిరంతరము వెదక వలెను.

వెదక వలెను వెదక వలెను
వదలకుండ వెదక వలెను
అలుపు సొలుపు లేక మనము
అడవంతా వెదక వలెను.
మన మింకా వెదక వలెను
మళ్లి మళ్లి వెదక వలెను.

ధైర్యోత్సాహము లుండిన
కార్యము నెర వేర గలదు
నిర్వి చార నిరుత్సాహ
ని స్పృహ లవి వలదు వలదు!

లెండి లెండి వీరులార!
లెండి లెండి శూరులార!
గుండె దిటవు చేసుక లే
వండి నిదుర లేవండి!

రేయనకను పవలనకను
లెండి వెదక లేవండీ!
క్షణమైన అలుపులేక
జనక సుతను వెదకండీ!

ఉగ్రశాసనుడు క్రూరుడు
సుగ్రీవుడు అతని ఆజ్ఞ
నెరవేర్చక పోయిన మన
కురి తప్పదు సఖులారా!

లెండి లెండి కపులారా!
లెండి నిదుర పోకండీ!
నిముషమైన వదలక సీ
తమను వెదక లేవండీ!"

అని ప్రోద్బల పరుచునట్టి
అంగదుని వచోమృతమున
కాయలసిన వానర వరు
లందరు నవ చైతన్యము
తో సీతాన్వేషణకు
ద్యుక్తులై విజృంభించిరి

ఇది సేతాన్వేషణమా!
ఇది సత్యాన్వేషణమా!
రామ కార్యమునకు నిర్వి
రామ శ్రామి కోద్యమమా!

## ఋక్షబిలము

వింధ్య రజత గిరులనెక్కి
వెదకి వెదకి అలసి సొలసి
కొండలు కోనలు గుహలును
ఘోరాటవులన్ని వెదకి
మరణ దండనకు భయపడి
మళ్ళి మళ్ళి వెదకి వెదకి

సీతను గానక మిక్కిలి
చింతించుచు తుదకు వింధ్య
గిరికి నిర్వతి దిశకొన కటు
తిరిగితి సరిగా నాటికి,
వానరపతి విధియించిన
ఆనతి నెల గడువు దాటె!

ఆ నైరుతి దిగ్భాగము
నందు హనుమదాది కపులు
ఒకరి కొకరు దగ్గరగా
నొరసి కలిసి సీతాన్వే
షణ చేయుచు నుండునపుడు
కనుపించెను మహాబిలము.

అది పాతాళమొ! లేకయె
అసుర మాయయో! ఏమో
అని ఆ బిల సమీపమున
కరిగిరంత_హనుమంతుడు_

"అదిగో! ఆ బిలము నుండి
హంసక్రౌంచ సారసవిహ
గాదులు చనుదెంచు చుండె_
అవిగో! అల్లదిగో! ఆ
గుహవాకిట చెట్లవిగో!
గుబురుగ కనుపించు చుండె_

కావున ఆ గుహ లోపల
బావియొ మడుగో! ఉండును"

అని నిస్పందదేహముతో
అన్నంతనె కపులందరు
బిలములోని కేగిరి ఆ
కలి దప్పులు దీర్చుకొనగ_

బిలమెంతో భయంకరము
బిలము కన్న ఆకలి ద
ప్పులు మరింత భయము గొల్ప
బిలమే నయమని తలచిరి.

కన్ను పొడుచుకున్నగాని
కానరాని రజని చీకటి
కమ్ము కొన్న ఋక్షబిలము
కపులందు ప్రవేశించిరి.

తిమిరావృత మగు బిలాంత
రమున దారి తప్పి పోదు
మని ఒకరిని ఒకరు పట్టు
కొని ముందుకు సాగినారు.

క్షుత్పిపాసలచేత
సుడి వడుచు ప్రాణాల

పై ఆశ వదలు కాని
పట్టు వీడని కపులు

సీతకయి వెదకుచును
చిమ్మ చీకటి లోన
ముందు ముందుకు నడిచి
పోసాగిరే కాని
వెనుకంజ వేయ రింతె న!
విధులెరుగు వారు కపులై న!

విధులెరిగి శ్రమియించ
విఫలు లెన్నడు కారు
విధులు మరచెడి వారు
విఫల మొందక పోరు

కడగండ్ల పాలగుచు
కపులేగి రట్లామ
డంత దూరము పిదప
అగుపించినది కాంతి.

ఆ కాంతిలో మనో
హరమైన విశ్రాంతి

వనముతో కూడిన భ
వనము కలదందు బం
గారు పాత్రలు వాటి
లో రమ్యమైనట్టి
పరిశుద్ధమైనట్టి
పాకములు ఫలములును
పరిపూర్ణముగ బెట్ట
బడి యుండె వాని జూ
చిన వెంటనోళ్లూరు చుండె!
వన చరము లెట్లూరు కుండె!

అయిన వాటిని ముట్ట
వడవి వసియించు వా
నరులైన వారు దు
ర్భర మైన క్షుత్పీడి
తులు వారు, క్రమ శిక్షి
తులు వారు, విధులెరుగు
వారు, వానర వరులు వారు!
వారి సరి నరులు కనరాలు!

## స్వయంప్రభ

అంతలో నచట నొక
అపురూపమైన తా
పస వనిత శుభ చరిత
వయసు మళ్ళిన దేవ
తాంగనను గనిరి వానరులు!
అదరిపడినారు చంచలులు!

అంతలో హనుమంతు
డదురు బెదురునులేక,
"ఎవరమ్మ! నీ విచట!
ఎందుకున్నా విచట?
ఎవరిదీ భవనమ్మ?
ఎవరిదీ భోగమ్మ?

అమ్మ! మేమంత మా
ర్గాయాసమున అలసి
ఆకలికి దప్పులకు
అలమటించుచునుంట
ముందు వెనుకలు జూడ
కిందులో జొచ్చితిమి.

ఇచటి అద్భుతములకు
ఎవరమ్మ కారకులు?
ఇది నీ ప్రభావమో!
ఇంకెవరి మహిమయో!
మా కెరుగ జెప్పవె తల్లీ!
మహిత ధార్మిక కల్పవల్లీ!"

అని అడిగినంత ఆ
అనఘురాలిట్లనియె—
"మయుఁడనెడి శిల్పి తన
మహిమచే ప్రతిభచే
ఇది యంత సృష్టించినాడు!
ఇది నాయదీనమ్ము నేడు!

మాయావియగు మయుఁడు
మహిత తప మొనరించి
బ్రహ్మచే బడసె శు
క్రాచార్యుని ప్రణీత
మైనట్టి సకల శి
ల్పాది శాస్త్రములెల్ల—

అతని లోపము హేమ
యను అచ్చరను తగులు
కొని యుంట అదితెలిసి
కినిసి ఇంద్రుడు మయుని
వజ్రాయుధాన వధియించె!
వక్రమగు వలపు వంచించె!

హేమ తన వశమైన
ఈ భోగ వన భవన
ములు నా కొసంగినది
ముఖ్య సఖినని తనకు
మేరు సావర్ణి కూతురను!
పేరేమి యన స్వయంప్రభను!

మీరెవ్వరిచటి కే
కార్యార్థమై వచ్చి
నారు నెరియలసియు
న్నారు, ముందుగ మీరు
ఈ ఫలము లీజలము
లింపార సేవించి

సేద దీర్చుక పిదప
చెప్పుడీ! వివరముగ–"
అని స్వయంప్రభ పలికినంత!
ఆరగించిరి ప్లవగులంత!

హనుమంతు డంత జరి
గిన దంత వివరించి
చెప్పినమ్రత తోడ
చేమోడ్చి ప్రణమిల్లి–

"జనని! ఆకలి దప్పు
లను దీర్చి మమ్ము కా
పాడితివి ఏమి ప్రతి
ఫలము గోరెదో చెప్పు
మదిచేసి పెట్టెదము
పిదపమము గుహబయట
చేర్పుమమ్మా! నీకు
చేమోడ్చెదము దీని
బయట పడు మార్గంబు
పరికించగా లేము!

గడువు దాటుచునుండె
పుడమి తనయను వెదుక
వలసి యున్నది మేము
బిలములో జిక్కితిమి".

అని పలికి నంతనే
విని జాలిగొని స్వయం
ప్రభ వానరుల తోడ
పలికె మృదువుగ నిట్లు-

ప్లవగులారా! రస
ప్లవగులారా! మీకృ
తజ్ఞతకు విజ్ఞతకు
ధర్మజ్ఞతకు మెచ్చి
తిని మీరలందరిక
కనులు మూసి కొనుండు!
క్షణములో మిము బయటజేర్తు!
కపులార! మీ కోర్కెదీర్తు!

అంత తమ సుకుమార
హస్తములతో కష్టలు
కనులు చప్పున మూసి కొనిరి!
క్షణ మాత్రలో బయట పడిరి!

## గడువు దాటింది

అదిగో! చూడు! వసంత
మదిగో సమీపించె!
ఇది ఫాల్గుణారంభ
మెద ఝల్లు మనిపించె!
విందు గొల్పు వసంత
మందు ఫలియించు మా
విళ్లు మొదలగు నట్టి
వృక్షములు కుసుమించె! ॥అదిగో॥

అదె చూడు మదె చూడు
మదె పూలు విరగ బూ
సిన చెట్లు! ఆ చెట్ల
పెనవేసి కొన్నట్టి
లత ఆ లత లనగ
లలితాను రాగమున

మగువలే తమ మగల
బిగుతు కౌగిళ్ళలో
చుట్టు కొన్నట్లుగా
చోద్యముగ గనిపించె! ॥అదిగో॥

లతలనెడి వనిత లను
రాగమున తమ ప్రియుల
మెడల తమకేలఁ బ్రే
ముడులతో జుట్టుకొన
వంగి పోయిన ప్రియుల
భంగిమను దలపించ
ఒక్కింత వంగినవి తరులు!
సొక్కుపడి చుట్టినవి లతలు!

పాలిండ్ల బరువుతో
పడతి వంగిన విధము
అమృతాంబు భరముతో
అంబుదము వాలినటు
పూలతో లతలతో
తూలుచును సోలుచును
ఒక్కింత వంగినవి తరులు!
సొక్కుపడి చుట్టినవి లతలు!

ఆదిగో చూడు! వసంత
మదిగో! సమీపించె!
ఇది శిశిర ఋతువకట!
ఎద ఝల్లు మనిపించె!

ఆశ్వయుజ మంతమున
హనుమ ప్రేరణ వల్ల
పిలుపు పదిహేను రో
జుల గడువుతో నిచ్చె-

ఆ పిదప కార్తీక
మందు జాప్యము జరుగ
లక్ష్మణుడు కోపించ
తత్క్షణముగా పది ది

నాల గడువిచ్చివా
నరుల పిలిపించి సే
నా వ్యవస్థ యొనర్చి
నలు దిక్కులకు పంపె-

శరదృతువు రెండు మా
సములిట్లు వానరుల
రప్పించి కార్యముల
నప్పగించుట జరిగె-

మార్గ శీర్షము గడువు
మాత సీతాన్వేష
ణార్థమ్మొసంగి పు
ష్యమున కిష్కింధ కరు
దెంచి సంగతి నెరిం
గించ వలెనని ఆజ్ఞ
నిచ్చిపంపెను గదా
నిచ్చితముగా రేడు!

మార్గశిర మంతయును
దుర్గాటవిని వెదకు
టందునను; పుష్యమా
సాంతమును బిలమందు
గడిచె! మాఘముగూడ
కడనుండె! మనకిడిన
గడువొక్క మాసమది
గడచి పోయిన దెపుడొ!
ఇక ముందు కర్తవ్య
మేది! చింతింపుడీ!
గడువు దాటెను నేతమేమి!
కఠిన హృదయుడు కపిస్వామి!

## ప్రాయోపవేశము

గడువు దప్పెను కాదు
పుడమిసుత వృత్తాంత
మైన కనుగొన కుండ
అధిపు కడ జేగుచో
మనల మన్నించునా రేడు!
మరణ దండన వేయువాడు!

ఇంకెట్లు ఇంకెట్లు
ఇంకెట్లు సేతమిక!
ఇలతనయ వెదుక నిం
కెందెందు బోదమిక!

గడువు దాటెను గాని
పుడమి తనయను గాన
మైతిమిక మనమేమి
సేతమిక సఖులార!

నను ముందుగా బెట్టు
కొని మీర లందరును
వచ్చితిరి గాని ఆ
వైదేహి గనరైతి

శింకేమి సేతమిక మనము?
శంకేల మృత్యువె శరణము!

అపరాధ మొనరించి
అధికారి దగ్గరకు
వెళ్లుటది సముచితము కాదు!
వైదేహి మనము గనలేదు!

కనుక ఇచ్చోటనే
మన ప్రాణముల వదలి
పెట్టెదము ప్రాయోప
వేశమున సఖులార!"

అని అంగదుడు పల్క
ఆ మాటలకు తాళ
మను గొట్టి తారాదు
లెసలేని భయముతో—
అంగదుండెంత లౌకికుడు!
అతడు తారకు తగిన సుతుడు!

[1]అష్టాంగ బుద్ధిగల
అంగదుడు [2]నాలుగు బ
లాలు గలవాడు [3]పదు
నాల్గు గుణముల వాడు
దనుజ గురు డింద్రునకు
తారసిల్లిన పగిది
ఇతని దగ్గర తారు
డిభ్భంచి తారసిలె"

---

1. అష్టాంగాలు = గ్రహణము, ధారణము, స్మరణము, ప్రతిపాదనము, ఊహ, అపోహ, అర్థవిజ్ఞానము, తత్వజ్ఞానము.

2. నాలుగు బలాలు = బాహుబలము, మనోబలము, ఉపాయ బలము, బంధుబలము.

3. పద్నాలుగు గుణాలు = దేశకాలాలు తెలిసి ఉండడం, చిత్త స్థయిర్యం, సకల దుఃఖాలు సహించు కోవడం, సర్వము తెలిసి ఉండుట, సామర్థ్యం, శరీరబలం, ఆలోచన రహస్యంగా ఉంచుట, అసత్యమాడకుండుట, శౌర్యం, తనబలం ఎదుటివాని బలం తెలిసిఉండడం, ఉపకారం మరువకుండుట, శరణన్నవాళ్ల నాదరించుట, కోపం ఆపుకోవడం, చాపల్యం లేకుండుట.

అని హనుమ అంగదుని
మనములో రాజ్య తం
త్రజ్ఞతను దెలిసి మది
తల పోసె తానిట్లు

కపి రాజ్యమెల్ల తా
నపహరించగ జూచు
చున్నాడు వీని భే
దోపాయమున గాక
తన వైపు త్రిప్పుకొన
తరము గాదని యెంచి—

## హనుమంతుని మందలింపు

అంగదా! రణములో
అతి సమర్థుడవీవు
నీవు నీ తండ్రి వలె
నెతి సమర్థుడ వీవు

కాని నీ మాటలకు
వానరులు లోబడరు
ఆలు బిడ్డల విడిచి
అనుసరింపరు నిన్ను

ఈ జాంబవంతుడును
ఈ నీలుడును మహా
కపి సుహోత్రుడు నిన్ను
కలసి యుండుట కల్ల!
అట్లె నేనును నిన్ను
అనుసరించుట దుల్ల!

వాలిసుత! నిన్ను నె
వ్వారు లెక్కించెదరు?
కలబొల్లి మాటలకు
కపివరులు లోబడరు.

ఏయుపాయముచేత
నేని మము సుగ్రీవు
నకు దూర మొనరించు
టకు నయభయాలతో
నీ వెట్టి కుట్ర ప
న్నిన గావ మేమెవ్వ
రము నీకు లోబడము చూడు!
భ్రమ పడకు నీకెవరుతోడు!

కపులు చంచలు లగుట
కల కాలమీ గుహం
తరములో నీ వద్ద
దార సుతులను వీడి
కలసి నీతో నుంట
కలలోని మాట!
కనుక భ్రమలను వీడి
వినుము నా మాట!

కపులు సుఖలాలసులు
కష్టాలు పడలేక
తమ ఆలు బిడ్డలకు
తమ బంధు మిత్రులకు
దూరమై ఈ బిలము
జేరి జీవిత మంత
కలసి నీతో నుంట
కలలోని మాట!
కనుక భ్రమలను వీడి
వినుము నా మాట!

ఆత్మ రక్షణ కొరకు
ఆరాట పడువాడు

బలహీనుడగు వాడు
బలవంతుతో విరో
ధము పెట్టుకొనరాదు చూడు!
భ్రమ పడకు నీ కెవరుతోడు!

ఈ బిలములో జేరి
ఎన్నాళ్ళు దాగెదవు?
ఈ చపల కపులతో
ఎట్లు జీవించెదవు?

లక్ష్మణుని బాణాలు
రూక్షములు తీక్ష్ణములు
ఋక్షబిలమిద నిన్ను
రక్షించగా లేదు.

వజ్రాయుధాలైన
వాడి బాణాలతో
లక్ష్మణుడు భేదించు
ఋక్ష బిలమును చూడు!
అపుడు నీకెవ్వారు తోడు?
చపల కపులా నీకు తోడు?

వీరెల్ల నిను వదలి
వెళ్ళిపోయిన నాడు
బంధువుల స్నేహితుల
బాసి ఏకాకివై
గాలికిం దూలి పడు
గడ్డి పరక విధాన
దిగులుతో వగలుతో
దిక్కుమాలిన వాడ
వై పోదు విది నిజము వినుము!
ఈ పాడు బుద్ధి వర్జితము!

నీవు మాతో గూడి
నీతిగా నున్నయెడ
తన పిదప కపిరాజ్య
మును నీకెపట్టంబు
గట్టు నీ పినతండ్రి నిజము!
కాని పని నీవు సేయకుము!

ధర్మేచ్ఛగల వాడు
నిర్మలాత్ముడు నీ

పినతండ్రి నీకు కీ
డొనరించ దెన్నటికి
ఇది నిజము నామాట వినుము!
ఈ కాని పని మాను కొనుము!

## అంగదుని మాటే నెగ్గింది

ఏమంటి వేమంటి
వేమంటి వో హనుమ!
మాయతో మారేడు
కాయ చేసితి వెంత
ఘనుడవయ్యా హనుమమామయ్యా!
వినిన నీమాట వినవలెనయ్యా!

ఘాతుకుడు నిర్దయుడు
భ్రాతృహంతకుడు సు
గ్రీవుడిక నేను కి
ష్కింధ కేగుదునేని
నను చంపు పగ ఘోరమయ్యో!
నా మంత్రమతి వెల్లడయ్యో!

కానెదరు నన్నెవరు?
నేననాథుడనైతి
పగవాడనని నేను
బహిరంగమై పోతి
నా మంత్రమెల్ల బయలయ్యె!
నా మృత్యువది తప్పదయ్యె!

కుత్సితుడు క్రూరాత్మ
కుడు ఘాతకుడు దయా
దాక్షిణ్యములు లేని
రాక్షసుడు సుగ్రీవు
డట్లు గాకున్నచో నతడు
అనఘుడా? భ్రాతృహంతకుడు?

బందినై హింసింప
బడుట కంటెను నాకు
ప్రాయోపవేశమే
పరమ సుఖ మనిపించు

కాన మీరంత నా
కాన తిడ వలెను

ఇట వచ్చుటే నాకు
ఎంతో మేలగును

ఇక మీరు మీ యిండ్ల
కేగగా వచ్చు
చెడిపోతి రెంటనను
విడిచి పోవచ్చు

వందనము వందనము
వందనము మీ కంత
వందనము మాతలకు
వందనము కపిరాజు
నకు, రఘువరేణ్యులకు
నా వందనము లనుడు.

అని అంగదుడు పల్క
నంతనే కపులెల్ల
జాలిగొని కనులశ్రు
జలము గ్రమ్మ కొనంగ
గళములో గద్గదిక
మొలకంగ ఇట్లనిరి

"అంగదా! నీమాట
లందు సత్యమె కలదు
నిన్నను సరించెదము
నీయట్ల చేసెదము"
అని పలికినారు వానరులు!
ఆర్ద్రమున చెమ్మగిల కనులు!

జాలి మాటల కెవరు
స్పందితులు కారు?
చపలురైనను కపులు
జాలిగల వారు

ప్రాయోప వేశమున
ప్రాణాలు వదలుటకు
అంగదుడు సిద్ధపడి
నంత తాము గూడ
ఆహారమును వదలి
ఆమరణ దీక్షకై
సిద్ధపడినారు వానరులు!
స్థిర బుద్ధిలేని చంచలులు!

దక్షిణాగ్రాలుగా
దర్భలను పరచికొని
ప్రాఙ్ముఖులుగా వాటి
పై పరుండి విచార
వారధిని మునిగి వానరులు!
వాకొనిరి శ్రీరామ కథలు!

ప్రాణాలు యరచేత
బట్టుకొని దీనులై
తమ దుస్థితికి కార
ణము గూర్చి చింతించి
శోకార్తులై రామ కథలు!
వాకొనిరి ఇట్లు వానరులు!

## రామకథ

కైకేయి తన కొడుకు
కై రాజ్య పట్టంబు
కోరినది, కోరెపో!
కొడుకు కొరకై సవతి

కొడుకు రాముని నడవి
కంపినది, అంపెపో!
ఆ రాము డడవి తన
ఆలితో రానేల?
వచ్చెపో! ముదుసలిది
వలపులో బడనేల?
పడెమపో! లక్ష్మణుడు
పడతి ముకు చెవు లేల
కోసె, కోసిన కోసె
పోసోదరుల తోడ
చెప్పుకొనె, అది అట్లు
చెప్పుకొనెపో! అయిన
దాని మాటలకేల వారు!
తమ సాగ్నిలోన బడివారు!
తామసంబున చేటు వచ్చు!
తగని పవి కడగండ్లు తెచ్చు!

అని వానరులు చెప్ప
కొనుచుండ నంగదుడు

అందుకొని యిట్లనియె
దెందములు డిందువడ!

"సీతాపహరణమ్ము
సేయుచున్నపుడు రా
వణుని తోడ జటాయు
రణమేల సేయవలె?

చేసెపో! రావణుని
చే జటాయువె చంప
బడనేల? ధర్మమే
భంగపడిపో నేల?

అంత వాడు జటాయు
వట్లయ్యెపో! మనము
ఎంత వారల మింక
ఏమైన అయ్యెదము.

రామ కార్యార్థమై
భూమి తిర్యగ్జంతు
వులు గూడ ప్రాణాలు
బలి పెట్టు చుండెపో!"

## సంపాతి

అని అంగదుడు పల్కి
నంతనే సంపాతి
విని భయంకర కంఠ
మున యిట్లు ప్రశ్నించె-

"ఎవడురా! ఎవడురా!
ఏమి నాతమ్ముని జ
టాయు చావును గూర్చి
అంటున్న వాడెవడు?

అపుడు సంపాతితో
కపి వీరు డంగదుడు
వృత్తాంత మంతయును
వివరముగ వచియించె.

రామ కథలోనేమి
రససిద్ధి కలదయో!
విన్నంత సంపాతి
విపదాగ్ని చల్లారె!

అతని కాలిన రెక్క
లవి వేగ చిగురించె
తన కథను సంపాతి
వినుమనుచు వివరించె—

మును నేను నాతమ్ము
డును పందెమును వేసి
కొని సూర్యు నిందాక
చనినాము పై కెగసి—

అపుడు సూర్యుని వేడి
కసుజుందు తట్టుకొన
లేక వివశుడు గాగ
నే కప్పితిని నాదు
రెక్కలను జాచి భ్రా
తృ స్నేహమున అంత
నా రెక్కలవి కాలెనకట!
నేరాలి పడిపోతినిచట!

అపుడు నా తమ్ముడే
మయ్యెనో తెలియరా

దయ్యో నేటికి వింటి
అట్లయ్యెనా వాడు!

పక్షములు కాలుటను
బ్రతుకంత భారమై
జీవచ్ఛవము వోలె
జీవించగా లేక
ముని నిశాకరు శరణు
గోని భక్తి ప్రణమిల్లి!

"ఓ నిశాకరమునీ!
ఓ దయారసధునీ!
నా రెక్కలిట్లయ్యె!
నా బ్రతుకు పాడయ్యె
నా పైని దయబూని
నన్నుద్ధరింపవే!"

అని నేను ఆ మునీం
ద్రుని వేడుకొని నంత
ఆ మహాత్ముడు పలికె
ఆర్ద్రమున నాతోడ.

"నీకు రెక్కలు వచ్చు
నీకేల భయ మ"నుచు
భగవానుడా మౌని
పలికె నాతో నిట్లు-

"రామకార్యార్థమై
భూమి తనయను వెదకు
చును వచ్చెదరు కపులు
శుభమగును నీ కపుడు!

సీత జాడను దెలియ
జెప్పవలె నప్పుడే
నీకు రెక్కలు వచ్చు
నీకు ముక్తి లభించు
ఆగవలె నందాక"
అని పలికె మునివరుడు.

నేటికి గదా! మహా
నీయుని నిశాకరుని
పలుకు నిజమైపోయె!
పక్షములు చివురించె!

ఆ మహాత్ముని నేను
ఆశ్రయించితి నాడు
ఆ స్వామి చెప్పినటు
లై పోయినది నేడు.

రామకథలోనేమి
రససిద్ధి కలదయో!
విన్నంతనే నాడు
విపదాగ్ని చల్లారె!

ఒకనాడు నే కంటి
నొక రూప సంపన్న
యైన యువతిని రావ
ణాసురుడు బట్టుకొని
విను వీధి బడి పోవు
టను గంటి నపుడామె-

గృధ్రముచే పట్టుబడి
గింజుకొను సర్పమటు
దనుజు పట్టు విదల్చు
కొనన పెనుగు లాడుచును-

తన ఒంటి నుండి నగ
లను దీసి క్రింద బడ
వైచుచును భూమివై
పే చూచుచును నేడ్చు
చుండ నే కంటి నా
గుండె తరుగుచు పోగ!

అపుడు రెపరెప మనుచు
ఆమె కట్టిన పట్టు
చీర తళతళ మెరసి
చిత్రముగ దోచినది

గిరి శిఖరిపై సూర్య
కిరణప్రసార మటు
మేగంబులో మెరుపు
తీగ మెరసిన యట్లు
నే గంటి నాగుండె
నీరధిగ మప్పొంగ-

ముసలి వాడను పక్ష
ములు లేవు నాకిట్లు

శిథిలమైనవి ఏమి
నేయుదును నా పరా
క్రమ ముడిగె జీవచ్ఛ
వమునై తి నాపన్న
నాదుకొన్న లేనైతి
నాదు దురదృష్ట మిది.

రామకార్య మొనర్చ
నే మొదటి వాడనై
యుండియును నేనూర
కుంటి నకటా దురం
తము జూచి యూర్కుంట
తగని దండనము గద!

రామ కార్యములోన
ధర్మమున్నది కదా!
దానికై ప్రతిప్రాణి
త్యాగమొనరించు గద!
ధర్మమును రక్షించు ఎడల
ధర్మమది రక్షించు మనల!

అగ్రజుడనై గూడ
అనుజునలె దౌర్జన్య

మరి కట్ట ప్రాణాల
నర్పింప లేనైతి
రామకార్య మొనర్ప
రాదయ్యె నా కపుడు,
వాక్సహాయ్యము మాత్ర
మే నేయ గల నిపుడు.

'రామ రామా!' యనుచు
'లక్ష్మణా'! యని యనుచు
దీనముగ బిలచుచును
హీన స్వరమ్ముతో
ఆక్రందనము నేయు
నబల గాంచితి నేను.

ఆమెయే సీతమ్మ
యైయుండవలె నింక
రావణాసురుడుండు
లంకాపురము గూర్చి
వివరించి చెప్పెదను వినుడి!
అవని సుత వెదుకగా చనుడి!

అదిగో! సాగర మదియె!
అచటి కేగుడు మీరు!

దాని మధ్యన గలదు
తనరు లంకాపురము
అది రావణాసురుని పురము!
అద్దాని చుట్టు సాగరము!

దాని జేరగ సము
ద్రము నూరుయోజనము
లను దాటి దాని ద
క్షిణ తీర మేగవలె—

అచటనే వెలసినది
అపురూప మైనట్టి
ద్వీపంబు దానిలో
విశ్వకర్మ వినిర్మి
తంబైన లంకా పు
రంబు నద్దానిలో—

రావణుని అంతః పు
రంబు, నందున సీత
రాక్షస స్త్రీలచే
రక్షితంబై యుండె—

బంగారు వాకిళ్లు
బంగారు వేదికలు
బంగారు మయమైన
రంగారు పట్టణము.

అదియె లంకాపురము
అంభోధి మధ్యగల
దచ్చోటి కేగ వలె
అవనిసుత గాంచవలె.

వినతాపుత్రులు గరుడా
రుణుల వంశజుల మగుటను
దివ్యదృష్టియును బలమును
భవ్య గరిమ మాకు గలదు.

శత యోజనముల దూరము
సమగ్రముగ జూడగలము
గాన యిచటినుండియె భూ
సూన రావణుల జూతును.

ఇక మీతలు వెళ్ళిరండు!
ఇష్టార్థము లీడేరును.
ఉదధి దాటుటకు నుపాయ
మది గాంచుడి మీకు జయము!

## జయగీతి

మొలచె రెక్కలు నాకు
కలుగు జయమిక మీకు!
కపులార మీరింక
కడలి దాటగ చనుడి!

అనిచెప్పె సంపాతి
అవనిసుత జాడ!
అంత కపు లేగిరా
అంబుధిని దాట!

సీత జాడను దెలియ
జెప్పుటం దమభూతి
రెక్కలను మొలిపించె
రివ్వుమనె సంపాతి!

రామ కథలో నేమి
రససిద్ధి కలదహొ!
సంపాతి దగ్ధప
త్రాలు మొలచిన వహొ!

* శ్రీ శ్రీ శ్రీ *

# ఫలశృతి

ఇది సీత వెదకు కథ
ఇది వినిన చదివినను
వ్రాసినను పాడినను
వఱలు సిరిసందలు.

జయమగును శుభమగును
సకలార్థములు గలుగు
శాంతి సుఖ సంతోష
సౌభాగ్యములు గలుగు

దారిద్ర్యమది తొలగి
భూరి సంపదలొదవు
రుజ ఋణములుడిగి ఆ
రోగ్య భాగ్యము లొదవు

నిరుపేద వాడు పె
న్నిధు లొంది జీవించు
సిరిగలాడు మరిన్ని
సిరులొంది సుఖియించు.

అరిమిత్రుడై పోవు
అగ్ని శీతల మగును
విషమమృతమై పోవు
వెత తొలగి శుభమగును.

ముసలి తనమది తొలగి
మొలచు నవయౌవనము
మోడు బ్రతుకు లిగిర్చి
పొందు నవ జీవనము.

భ్రష్టులును నష్టులును
బాగుపడుదురు జడులు
చైతన్యవంతులై
జన్మాబ్ధి నీదెదరు.

ఇది సీత వెదకు కథ
ఇది వినిన చదివినను
వ్రాసినను పాడినను
వఱలు సిరి సంపదలు.

మంగళమ్ మహత్
— శ్రీ శ్రీ శ్రీ —